శ్రీ హయగ్రీవాయనమః

# మహాత్మా గాంధీ

## జాతక రహస్యములు

(సంపూర్ణ జీవిత చరిత్ర)

రచయిత:

జ్యోతిష విశారద

వద్దాది వీర్రాజు సిద్ధాంతిగారు

ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

వెల రు 0—8—0

# పీఠిక.

మహాత్మాగాంధి అవతారపురుషుడా యను సందేహము ప్రపంచమునందలి ప్రతిమానవునకును కలుగుట సహజము. అట్టి విషయమును మహాత్ముని జాతకము ననుసరించి నిర్ణయింప వలసి యున్నది. ఆ దివ్యపురుషుడు 2-10-1869 తేదీని పోరు బందరు అను గ్రామమున జన్మించెను. ఈ జననకాలము ననుస రించి జాతకచక్రము లిఖించి మహాత్ముడు మానవమాత్రుడా, అవతారపురుషుడా యను విషయమునుగురించి విపులముగ వివరించితిని. మరియు మహాత్ముని సంపూర్ణ జీవితచరిత్ర కూడ వ్రాసియుంటిని.

గాంధిజీ సంపూర్ణస్వాతంత్ర్యమునకై నిరంతరము కృషి సలుపుచుండెను. ఆ లోకోద్ధారకుని అభీష్టమెన్నటికి సఫలమగు నను సమస్య జాతకచక్రమందలి గ్రహసంచారమును బట్టి సవిస్తరముగ నీ గ్రంథమున వ్రాసితిని. పశ్చిమదేశ (ఇంగ్లండు) సిద్ధాంతులు మహాత్ముని జాతకము ననుసరించి తెలిసిన విషయముల నిందు పొందుపరచి యున్నాను.

ఇత్యాది బృహజ్జాతక, జైమినీసూత్ర, విద్యామాధవ పరాశర, నీలకంఠీ దాచక, గ్రహజ్ఞాభరణ జాతక రాజీయ

జాతక శాలం కారాది యు తమ జ్యోతిష శాస్త్రముల ననుస రించియు భృగునాడీ, నందీనాడి, చంద్రనాడి మొదలగు నాడీ గ్రంథరాజముల బట్టియు మహాత్ముని జాతక మహిమలు విశదముగ తెలిపియుంటిని.

గౌతమబుద్ధుడు అహింసా సిద్ధాంతమును లోకమ్మున నెలకొల్పి సుస్థిరకీర్తిని పొందెను. అట్టి అహింసా సిద్ధాంతమునే తిరిగి మహాత్ముడు లోకమున కుపదేశించుచున్నాడు. ఆ తేజో మయుని జీవితచరిత్ర సంపూర్ణముగా వ్రాయబడిన యీగ్రంథ మును చదివి మానవు లెల్లరును ధన్యత చెందుదురని నమ్ము చున్నాను. ప్రతి భారతీయుడును మహాత్ముని వోలె అహింసా సిద్ధాంతము నవలంబించి, దేశభక్తాగ్రేసరుడై, దాన ధర్మ పరోప కారాది సద్గుణసంపన్నుడై వర్ధిల్లుచుండ వలయునని సర్వదా వినయపూర్వకముగా హెచ్చరించుచున్నాను.

ఇట్లు
సర్వజన విధేయుడు
వద్దాది పీరాజు

శ్రీహయగ్రీవాయనమః

# మహాత్మాగాంధి

---

## జననవివరములు - బాల్యము

శ్లో. పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగేయుగే.

గాంధి మహాత్ముడు 2-10-1869 తేదీ శనివారమున గుజరాతు దేశమునగల పోరుబందరు గ్రామములో జన్మించెను. సుథాదానికి సుపురి యను నామాంతరము గలదు. అది శ్రీకృష్ణుడు నివసించిన ద్వారక కేబది మైళ్ళలో నున్నది.

ఆప్రాంతమువారిని పూర్వము యాదవులనియు, తరువాత సౌరాష్ట్రులనియు, పిదప ఘూర్జరులనియు పిలుచుచుండెడివారు. వారినిప్పుడు గుజరాతీయు లందురు. వీరు తరుచు వ్యాపారములచే జీవించుచుందురు.

మహాత్ముని పూర్తిపేరు 'మోహనదాస్ కరంచంద్ గాంధి' అందు 'మోహనదాసు' స్వంతపేరు. 'కరంచందు' తండ్రిపేరు. 'గాంధి' యనునది యింటిపేరు. గాంధి యనువారు వైశ్యులు. గాంధితండ్రి 'ఉత్తమచందు' పోరుబందరు సంస్థా

నముకకు దివానుగ నుండెను. మరికొంతకాలము రాజకోట సంస్థానములో దివానుగ పనిచేసెను. అందువలన వీరు వైశ్య కుటుంబమునకు చెందినవారైనను ఉద్యోగములమునసే జీవించెడివారు. తిరిగి పోరుబందరు సంస్థానాధీశ్వరు ననుగ్రహము బడసి పోరుబందరునకు మంత్రియయ్యెను.

ఉత్తమచందునకు మొదటిభార్యకు నలుగురు కొడుకులు రెండవభార్యకు యిరువురు కుమారులు, వీరిరువురిలో జ్యేష్ఠుడే 'కరంచందు' గాంధి. కరంచందు మొదట పోరుబందరునకు మంత్రిగానుండి తరువాత రాజకోట మంత్రిగానుండెను. అందు వలన పోరుబందరు దివానుగిరీ ఈయన తమ్మునకు లభించెను.

కరంచందునకు నాలుగు వివాహములైనవి. మొదటి ముగ్గురును వరుసగ చనిపోయిరి. వారికి పిల్లలులేరు. నాల్గవ భార్యపేరు 'పుత్తలీబాయి' ఆమెకు ముగ్గురు కొడుకులును ఒక కూతురు కల్గిరి. అందు మోహనదాసు కడపటివాడు.

మహాత్మునితండ్రి కరంచందు గొప్ప పండితుడు కాడు. కాని గొప్ప ధైర్యశాలి, న్యాయశీలుడు, దైవభక్తుడు, గీతా పారాయణుండు, ప్రాజ్ఞుడు అందువలననే అతడు చాలకాలము దివానుగ నుండెను.

మహాత్మునితల్లి గొప్ప గుణవతి, ధర్మశాస్త్రాభ్యాసా సక్తురాలు, దైవభక్తి, ఉపవాసప్రీతి, మొదలగు సద్గుణము లతో విరాజిల్లుచుండెడిది. సదా వ్రతములు చేయుచుండె

డిది. అట్టిసద్గుణములుగల దంపతులకు జన్మించుటవలననే మోహనదాసు గొప్ప సద్గుణములు కలవాడయ్యెను.

## 2 బాల్యము - వివాహము

పోరుబందరున పెద్దస్కూళ్ళు లేకపోవుటవలన బాల్యమందు గాంధి వీధిబడులందే చదివెను. తరువాత రాజకోటలో తండ్రికి ఉద్యోగము లభించుటవలన రాజకోటవెళ్ళి ప్రైమరీ స్కూలులోను తరువాత హైస్కూలులోను చదివెను. గాంధికి తల్లిదండ్రులయందు భక్తిమెండు. సత్యపరతయే ముఖ్యమని గాంధి చిన్ననాటనే తెలిసికొనెను, హరిశ్చంద్రనాటక మొకసారి గాంధి చూచెను. అప్పటినుండియు సత్యానక్తి హెచ్చెను. 'సుధాముడు' తల్లిదండ్రుల కనంతసేవ జేసిన కథ నొక పుస్తకములో చదివెను. అప్పటినుండియు పితృభక్తి హెచ్చెను.

గాంధీకి 13 యేండ్ల వయస్సురాగానే వివాహమయ్యెను. గుజరాతీయులు వైష్ణవ సాంప్రదాయపరులు. పనిలో పనిగ అన్నవివాహముతోపాటు మోహనదాసుకు వివాహముజేసిరి. గాంధిమహాత్ముని భార్యపేరు కస్తూరిబాయి ఈమె ధీరురాలు సామాన్యముగ చదువుకొన్నది వివాహానంతరము ఆ విద్య కూడ మానివేసినది.

మంత్రిగర్జాను సరిపడినట్లు కొన్నినెలలు వివాహనన్నాహములు జేసిరి. రాజకోటనుండి పోరుబందరునకు తిరలివెళ్లు త్రోవలో బండి తిరుగబడి గాంధీకి దెబ్బలు తగిలినవి. మొదట

వాటికి లెక్కసేయలేదు. కాని క్రమముగ నది దీర్ఘవ్యాధికిగ్రింద పరిణమించినది.

ఆపెండ్లితో అన్న చదువు మానివేసెను. గాంధియును ఆసంవత్సరము విద్యచెడి, తిరిగి మరుచటి సంవత్సరము ఆ క్లాసులోనే ప్రవేశించెను. అట్టిలోపమును తీర్చుటకై ఉపాధ్యాయులాతనిని సంవత్సరముమధ్య 3-వ పారమునుండి 4-వ పారమునకు ప్రమోషను చేసిరి. గాంధి పారములు మిక్కిలి శ్రద్ధగ చదువుచు ప్రతిసంవత్సరము పరీక్షలలో నెగ్గెను. చిన్న నాటనుండియు గాంధి నీతిప్రవర్తనయం దెక్కువశ్రద్ధ వహించెను. సాయంకాలములందు ఆటలకై మహాత్ముడు బయలుటకు పోక వ్యాధిగ్రస్తుడగు తన తండ్రికి సదా యుపచారము చేయుచుండువాడు. కాని. ఆరోగ్యమునకై ప్రతిరోజును చాలమేర నడచుచుండెడివాడు.

ఈవిధముగ జరుగుచుండ 1885 లో మహాత్ముని తండ్రియైన కరంచందు దీర్ఘవ్యాధిచే రాజకోటలో చనిపోయెను. తరువాత 1887 మోహనదాసు మెట్రిక్యులేషను పరీక్షయందు త్తీర్ణుడయ్యెను.

మహాత్ముడు తరువాత ఇంగ్లండు వెళ్ళి బారిష్టరు చదువుటకు నిర్ణయించుకొనెను. కాని, సీమ ప్రయాణమునకు సొమ్ములేదు. చేయునదిలేక పోరుబందరు పాలకుడైన 'శాహీ' ద్వారను దర్శించెను. కాని లాభము లేకపోయెను. అన్న

కొంత సహాయముచేసెను. భార్యనగ లమ్ముట వలన కొంత ధనము చేకూరెను. కాని, ఆయనతల్లి గాంధీని సీమ పంపుట కిష్టపడలేదు. సీమ పోయినవారు కల్లు, మాంసములను తిందు రని ఆ వీరమాత అభిప్రాయము. అదియునుగాక సముద్ర ప్రయాణము కూడదని ఆకాలములో పెద్ద చర్చలు జరుగు చుండెను. విదేశములయం దనాచారములు జరుగునని యామె తలచెను. అందువలన మధ్యము, మాంసము, స్త్రీలు వీటిని 'వదలుదు' నని పుత్రునిచే నామె ప్రమాణము చేయించుకొని అనుమతి నిచ్చెను. గాంధి ఆడినమాట తప్పడని ఆమె యెరుం గును. అప్పటికి మహాత్మునకు ఒక పుత్రుడు జన్మించెను. భార్య, పుత్రుని అత్తవారింట వదలి బొంబాయి చేరుకొనెను. ఇంగ్లండు వెళ్ళిన కులములో వెలివేయుదు మని కులపెద్దలు భయపెట్టిరి. కాని అందులకు మహాత్ముడు భయపడలేదు. ఆ చదువుకే మరియొక వకీలు ఇంగ్లాండుకు ప్రయాణమయ్యెను. అతనితో కలసి గాంధి స్టీమరు నెక్కెను.

## 3. స్టీమ లో చ దు వు.

స్టీమరులో రెండువారములు ప్రయాణము చేసెను. ఆస్టీమరునం దందరు మద్యమాంసాదులను భుజించుచుండుట గాంధి చూచెను. అందువలన ఆస్టీమరులో పచనము కాబడు ప్రతివస్తువు మాంసమిళితమని గాంధి అనుమానించెను. అందు వలన నింటినుండి తెచ్చుకొనిన రొట్టెమిఠాయిలనే తిని ప్రయా ణదినముల నెట్లో గడపెను. అహింసాతిత్వము వలన ఆత్మవిశ్వా

సము పొందవచ్చునని ఆయన తలంచెను. అదియునుగాక మద్యనిషేధము, శాకాహారము, ఆరోగ్యదాయకమునై నవని ఆయన గ్రహించెను. అందువలన ఎవ్వరెన్నివిధముల చెప్పినను మద్యపానముగాని, మాంస భక్షణగాని చేసియుండలేదు.

ఆవిధముగనే స్త్రీలవిషయంలో గూడ మిక్కిలి జాగ్రత్తగ సంచరించెను. ఇంగ్లండులో మిక్కిలి సౌందర్యవతులగు కన్యకామణు లెందరో యుందురు. వారు బ్రహ్మచారులతో మిక్కిలి చనువుగనుందురు. గాంధి మాత్రము వారికి చనువీయక తాను వివాహితుడనని చెప్పి తప్పించుకొనుచుండెడివాడు.

కాని హేటు బూటు సూటులను ధరించి దొరల పద్ధతుల నాతఁడు అలవరచుకొనెను. మరియు డాన్సింగు, ఉపన్యాసము ఫ్రెంచి భాషను గాంధి కొన్నిమాసములు నేర్చుకొనెను. కొంతకాల మైనతరువాత భారతీయుల కివి అనవసరము లని గ్రహించి వాటిని మానివేసి మితవ్యయమున కలవాటుపడెను. చౌకయగు వస్తువులనే తినుచుండెడివాఁడు. ఖర్చు తగ్గునని రొట్టెను కూరను స్వయముగ వంటచేసుకొనుచుండెడివాడు.

బారిష్టరు పరీక్ష మిక్కిలి సులభము. అందువలన గాంధి లండనులో మెట్రిక్యులేషను పరీక్షకు చదివెను. అందులకుగాను యూరపువారి ప్రాచీన భాషయగు 'లాటిను'ను నేర్చుకొనెను. న్యాయశాస్త్రము గ్రంథము లనేకములు జదివెను. మతగ్రంథములను బెక్కిటిని చూచెను.

1891 లో బారిష్టరుపట్టా పుచ్చుకొని గాంధిమహాత్ముడు మనదేశమునకు తిరిగివచ్చెను. బొంబాయిలో దిగి తరువాత

తన తల్లి గతించెనని తెలిసికొనెను. విదేశమున నుండు గాంధికి విచారము కలుగజేయకుండుటకై ఆవార్త బంధుగులు ఇంగ్లాండులోనుండు గాంధీకి తెలుపలేదు.

కొందరు పెద్దలు మరల గాంధీని కులములో వెలివేసిరి. కాని ఆబహిష్కారము క్రమముగ తగ్గిపోయెను.

4. బొంబాయిలో ప్లీడరీ ప్రాక్టీసు

తరువాత మహాత్ముడు బొంబాయిలో ప్లీడరీ ప్రాక్టీసు చేయుటకు ప్రారంభించెను. క్రొత్తయగుటవలన కేసులేవియు రాలేదు. అన్ననుండి డబ్బు తెప్పించుకొనుట కిష్టములేక విసుగుజెంది, కొన్ని మాసముల యనతరము బొంబాయినుండి మకాం యెత్తివేసెను.

అన్నగారు రాజకోట సొలిసిటరు కంపెనీలో సభ్యుడు. వారిద్వారానే కేసులు వకీళ్ళకు వచ్చుచుండును. అందువలన గాంధి రాజకోటలోనే మకాము పెట్టెను. కాని, ఆచిన్న కేసుల వలన సామాన్య ధనరాబడి కలుగుచుండెడిది. కొంతకాలమునకు దస్తావేజులు, దావాలు, పిటీషనులు వ్రాయుటలో చాల సమర్థుడని పేరువచ్చినది. కాని అక్కడ నుండిన ఆంగ్లేయాధికారి ముక్కోపి. ఆతడు వకీళ్ళను తరుచు అమర్యాదచేసెడి వాడు గాంధి అందుల కొప్పుకొలేదు. అందువలన వారిరువురకును మనస్పర్థలు కలిగినవి. దానంజేసి ఆకోర్టులో పనిచేయుటకు గాంధి అంగీకరించలేదు.

గాంధి జన్మస్థలమైన పోరుబందరు నివాసియగు అబ్దుల్లా అను 'మెమను' మహమ్మదీయునకు ఒక కంపెనీలో దక్షిణాఫ్రి

కాలో ఒక పెద్దదావా వ్యాపారపు లెక్కలను గురించి జరుగు చుండెను. అందు తన ప్లీడరుకు తగుసలహా నిచ్చుటకు దక్షిణాఫ్రికాలో ఒక యేడాది నుండుమని అబ్దుల్లా కంపెనీవారు కోరిరి. సంవత్సరమునకు 105 కాసులు నిచ్చుటకు వారంగీకరించిరి. లోకానుభవము కలుగునని మిక్కిలి ఉత్సాహముతో 1893 ఏప్రిలులో భార్యను బిడ్డలను విడిచి వంటరిగ గాంధి దక్షిణాఫ్రికాకు వెళ్ళెను.

### 5. ఆ కాలమున దక్షిణాఫ్రికాస్థితి.

అచట నల్లవారును అనాగరికులును నివసించుచుండిరి. అప్పటికి నూరుసంవత్సరముల క్రితము యూరపువాసు లగు తెల్లవారు అక్కడ నివసించుచుండిరి. దక్షిణాఫ్రికాలో తూర్పుభాగమునకు నేటాలును ఉత్తరమున ఆరేంజీ ఫ్రీస్టేటును, పడమట ట్రాన్సువాలును, దక్షిణమున కేపుకాలనియు కలవు. అందు ట్రాన్సువాలులో అధికారము డచ్చివారిది. మిగిలిన వాటియందు ప్రభుత్వము ఆంగ్లేయులదే అక్కడ భూములు మిక్కిలి సారవంత మయినవి. ట్రాన్సువాలులో బంగారు గనులు కలవు. అక్కడ పనిచేయుటకు సమర్థులగు కూలీలు లేరు అందువలన 1860 నుండియు బ్రిటిషువారు మనదేశీయులుచాల మంది అక్కడకు కూలీలుగ తీసుకొని వెళ్ళిరి. ఈకూలీలవలన నేటాలులో తెల్లవారు తోటలలో పనిచేయించి ప్రతిసంవత్సరము కోట్లకొలది రూపాయలను సంపాదించెడివారు. కొంతమంది భారతీయులుకూడ పొదుపుతో అక్కడ కొంతఆస్తి సంపాదించి వర్తకముచేయు నారంభించిరి. ఈవిధముగ మనవారికిని

తెల్లవారికిని అక్కడ పోటీకలిగినది. అందువలన మనవారిని తెల్లవారు అణగద్రొక్కవలయునని ప్రయత్నించెను.

దక్షిణాఫ్రికా నీవిధమగు దుస్థితియందుండుటెరి గాంధీ నేటాలు రేవుపట్టణమగు 'డర్బను'లో దిగెను. అబ్దుల్లా సేటుగా రక్కడ గాంధిని ఆదరించి వారి ఇంగ్లీషు వకీళ్ళను గాంధికి పరిచయము చేసిరి. ఆ కేసు విచారణ యింకను కొన్నిమాసములు వ్యవధి యుండెను. దక్షిణాఫ్రికాలో దుస్థితి నంతను కొంతకాలములోనే గ్రహించెను. తెల్లవారు గాంధిని కూడ నీచముగ చూడసాగిరి. కోర్టులలో తలపాగతో ప్రవేశింప వీలులేదు. రైళ్ళలో పెద్దతరగతులలో తెల్లవారితో సమానముగ కూర్చుండు హక్కు భారతీయులకు లేదు. దొరల హోటలులలో మనకు బసలులేవు. అక్కడ భారతీయులను కూలీలని పిలుతురు. ఈవిధముగ అక్కడ భారతీయులు మిక్కిలి బాధలు పొందుచుండుట గాంధిమహాత్ముడు చూచి సహించలేకపోయెను.

గాంధిగారు పనిచేయుటకై వెళ్ళిన కేసు ట్రాన్సువాలుకు ముఖ్యపట్టణమైన 'ప్రిటోరియా' కోర్టులో నుండెను. గాంధి ఆపట్టణమునకు వెళ్ళి అబ్దుల్లాగారి కక్కడ అటార్నితో 'బేకరు' కేసునుగురించి తగు చర్చలు జరిపెను. గాంధిగారు బారిష్టరు వేషములో నున్నను వారికక్కడ తగు వసతియే దొరకలేదట.

## 6 అబ్దుల్లా కేసు రాజీయగుట.

'అబ్దుల్లాసేటు' త్యాబిజీసేటు కంపెనీవారి మీాద 6 లక్షల రూపాయలకు దావా చేసెను. వీరిరువురకు దక్షిణాఫ్రికాలో

వేరు వేరు కంపెనీలుకలవు. మరియు వీరిరువురుదగ్గర బంధువులే. ఈరెండు కంపెనీలమధ్య సరుకులు సామ్ము యిచ్చి పుచ్చుకొను ఖాతాలు చాల కాలము జరిగినవి. కానీయిముయు నీయునక్కర లేదనియు అబ్దుల్లా కంపెనీవారు చూపించుచున్న లెక్కలు సృష్టి యనియు త్యాబ్జివారు వాదించుచుండిరి. ఎవరిది న్యాయమో కనుగొనుటకు గాంధి మిక్కలి శ్రద్ధతో నిరుపక్ష ముల రికార్డులను తనిఖీ చేసెను.

చివరకు అబ్దుల్లాగారి కేసే న్యాయమని గాంధి గ్రహించెను. ఈకేసు చాలా పెద్దది. చాలమంది సాక్ష్యమును లెక్కల తనిఖీయును కావలయును. అందువలన చాలకాలము పట్టును, తరువాత అప్పీళ్ళు జరుగును. ఈమధ్య కోర్టులు ప్లీడర్లు బాగు పడుటయే జరిగి చివరకు ఉభయపార్టీలు చెడుదురు. అందు వలన రాజీ న్యాయమని గాంధికి తోచెను. అదియును గాక యీ దావావలన దక్షిణాఫ్రికాలో రెండుకక్షు లేర్పడినవి. అందువలన మన భారతీయులలో అక్కడ సంఘీభావము చెడినది. అందువలన నిరువురకు రాజీ కుదుర్చుటకై గాంధిజీ విశ్వప్రయత్నములుచేసెను. గాంధి న్యాయప్రవర్తన కలవాడని రెండుపక్షములవారికి ఆయనయందు గౌరవము మెండు.

గాంధిజీ ఉభయుల అంగీకారముచొప్పున ఒక పంచాయితీ నేర్పరచెను. వారు దావా రికార్డును పూర్తిగ పరిశీలించి తీర్పు చెప్పిరి. అందు నేటు అబ్దుల్లాయే నెగ్గెను. కాని 6 లక్షల రూపాయలు ఒక్కసారి చెల్లించుట కష్టము. అందువలన

త్యాబ్జీ౦పెనీవారి కోరిక ప్రకారం వాయిదాల ప్రకారం అప్పు తీర్చవలయును అని పంచాయితీ తీర్పు చెప్పెను. గాంధిమహాత్మునివలన నింతటి పెద్దకేసు స్వల్పకాలములో శ్రమలేకుండ పూర్తియైనది.

7. గాంధిజీ సంఘసేవ చేయుట.

ఇంతలో గాంధిజీ దక్షిణాఫ్రికా వచ్చి ఒక సంవత్సరమైనది. అబ్దుల్లా కంపెనీవారు తనకిచ్చిన 105 కాసులను అన్నగారికి పంపెను. కాని, తాను స్వదేశమునకుపోవుటకు డర్బను రేవుపట్టణమునకు వెళ్ళెను. ఆ ప్రయాణము జరుగలేదు. అందువలన ఆయన దక్షిణాఫ్రికాలో యుండి బారిష్టరు ప్రాక్టీసు చేయవలయు నని స్థిరపరచుకొనెను. అందువలన నేటాలులో సుప్రీము కోర్టువారికి దరఖాస్తు పెట్టగా తెల్లవారు అనేక ఆటంకములు కలిగించిరి. కాని, న్యాయప్రకారము కోర్టువారాయనకు అనుమతి నిచ్చిరి.

తరువాత గాంధీజీ తన సత్ప్రవర్తన వలన ప్రఖ్యాతి చెందెను. తరుచు ఆయన కేసులను రాజీచేసి పార్టీలకు సఖ్యత కలిగించుచుండెను.

గాంధీజీ న్యాయమైన కేసులనే పట్టుననియు, మంచి సలహా నిచ్చునని యు పేరు బొందెను. కార్యదీక్ష, నీతి ప్రవర్తన, బుద్ధిసూక్ష్మత, ఆంగ్లేయులనుకూడ ఆకర్షించెను. తాను సంపాదించినధనము చాలవరకు భారతీయుల క్షేమమునకై వినియోగించుచుండెను.

మరియు ప్రతివారము సభలు జరిపి ఆరోగ్యము

సత్ప్రవర్తన, విద్య మొదలగునవి భారతీయులకు బోధించుటయే కాక సర్వమతముల మూలసూత్రమొక్కటియే యని చెప్పి వారి నొప్పించెను. అందువలన అక్కడ హిందూ మహమ్మదీయ క్రైస్తవుల సఖ్యత యేర్పడెను. దానంజేసి సర్వమతములవారు ను గాంధిని ప్రేమించిరి. కొందరు యూరపియనులు కూడ స్నేహితులై సదా ఆయననీతివర్తనకు సంతసించుచుండిరి.

అచటియూరపియనులు భారతీయులందసూయ వహించి 1894 లో ప్రభుత్వసహాయమువలన రెండుబిల్లులు తెచ్చిరి.

(1) అందు అచట భారతీయులలో నెవ్వరికి 'వోటింగు' హక్కు ఉండకూడదని.

(2) ప్రతిహిందువుడు సంవత్సరమునకు 25 పౌనులు పన్ను చెల్లింపవలయుననియు నాబిల్లుల అర్థము.

వాటి యనర్థము నచటి హిందువులు గ్రహించనేలేదు. 'పొమ్మనలేక పొగబెట్టినట్లు' భారతీయుల నణచివేయుట కా బిల్లుల పెట్టిరని గాంధి గ్రహించెను. వాటిని ఎదుర్కొన వలయునని ఆయన కొన్ని సభలను జేసి భారతీయులకు బోధించెను. వాటి నెదుర్కొనుటకు గాంధీజీయే సమర్థుడని అక్కడి వారు గ్రహించి గాంధి స్వదేశమునకు పోవుటకై వారంగీకరించక ఆయనను ప్రార్థించి స్వదేశమునకు ప్రయాణమవుచున్న గాంధీజీని ఆపుచేసిరి. ఈవిధముగ గాంధీజీ సంఘసేవచేయుటకు దక్షిణాఫ్రికా భారతీయుల కోరిక ప్రకార మందే నివసింపవలసి వచ్చెను.

### 8. నేటాలు ఇండియన్ కాంగ్రెస్ స్థాపన.

తరువాత గాంధిజీ 'నేటాలు యిండియన్ కాంగ్రెస్' అను సంఘము నొక దానిని దక్షిణాఫ్రికాలో స్థాపించెను.

అందులకై కొంతధనము కావలసి వచ్చెను. కనుక వారినుండి చందాలు వసూలుచేసి ఆధనమును కాంగ్రెసు పను లకు వినియోగించుట ప్రారంభించెను. సంఘసేవయు, స్వజాత్యభిమానమును, ఆసంఘముయొక్క ముఖ్యోద్దేశ మని ఆయన బోధించెను.

ఇదివరలో భారతీయులపయి విధించిన బిల్లులను నిరసించుచు భారతీయుల సంతకములతో అర్జీలను తయారుజేసి ప్రభుత్వము నకు పంపెను. సభలు, ఊరేగింపులు జరిపి భారతీయుల అసమ్మతిని నేటాలుప్రభుత్వమునకు తెలిపి గొప్పఅలజడి పుట్టించెను.

వోటింగుహక్కు లేకుండ తేబడినబిల్లు రెండవసారికూడ కౌన్సిలులో ఆమోదింపబడెను. భారతీయుల అసమ్మతివలన ప్రభుత్వమువారు దానిని కొంతకాల మాపుజేసిరి. కాని చివ రకు ఆబిల్లు అమలులో పెట్టబడినది. తరువాత గాంధీజీ కొన్ని కరపత్రములు పంచిపెట్టి. ఆందోళనను వృద్ధిజేసిరి. అప్పుడు ప్రభుత్వమువారు కొంచెము కన్నుతెరచి ఆపన్నును సాలీనా 25 పౌనులనుండి 3 పౌనులకు తగ్గింపదలచిరి. తలపన్ను అన్యాయమనియు, అనాగరికమనియు గాంధిగారు ఆందోళన చేయుచు ప్రతిఘటననువృద్ధిజేసిరి. తలపన్ను నెవరును చెల్లించకూడదని హెచ్చరించిరి. ఈఆందోళన వృద్ధిచేయుటకై హిందూ జాతీయు

నందలి భారతీయుల సహాయము నపేక్షింప 1896 లో బయలు దేరి గాంధీజీ మనదేశమునకు వచ్చెను.

ఇక్కడ కలకత్తా, ఢిల్లీ, బొంబాయి, మద్రాసు మొదలగు గొప్పపట్టణములందు పెద్దపెద్ద సభలు జరిపి దక్షిణాఫ్రికాలో భారతీయులకు జరుగుచున్న అన్యాయములను గురించి చాల ప్రచారము చేసిరి. అప్పుడు మన దేశములు ద్రవ్యసహాయమును వాస్సహాయమునుగూడ జేసిరి. అప్పుడు దేశాభిమానము, కార్యదీక్ష, న్యాయప్రవర్తన గాంధిజీకి కలవని తిలక్ గోఖలే మొదలగు నాయకులు గ్రహించిరి. అందువలన గాంధిజీకి ఆనాయకులతో స్నేహము లభించెను. గాంధీగారి సమర్థతకు యూరపియనులుకూడ మెచ్చుకొనిరి. హిందూదేశమున నీవిధముగ జరుగుచున్న కాలమున దక్షిణాఫ్రికాలో పరిస్థితులు తారుమారైనవి. వెంటనే బయలుదేరి రావలయునని గాంధీజీకి తంతివార్తలు వచ్చెను. అందువలన 1896 లో కుటుంబసహితముగ గాంధీజీ దక్షిణాఫ్రికాకు అబ్దుల్లా క-పెనీవారు నడుపుచున్న ఓడమీద వెళ్ళెను మార్గమధ్యమున పెద్ద తుఫాను వచ్చెను. కాని, దైవానుగ్రహమువలన ఓడ సురక్షితముగ దక్షిణాఫ్రికా చేరెను.

## 9 ఆంగ్లేయులు గాంధిగారిని కొట్టుట.

దక్షిణాఫ్రికా భారతీయులను యూరపియనులు పెట్టు బాధలను గురించి మనదేశమున గాంధిగారుచాల అసత్యములు చెప్పి దొరను దూషించెనని దక్షిణాఫ్రికా పత్రికలు ప్రచురించెను. అందువలన అక్కడ ఆంగ్లేయులకు గాంధిగారిపై రోషము కలిగెను గాంధిగారు 800 భారతీయులతో ఆఫ్రికాకు

వచ్చుచున్నారని తెలిసి గాంధిజీని ఓడ దిగకుండగ చేయవలయునని చెప్పెను అధికారులు కొన్ని అడ్డములు కల్పించిరి. కాని గాంధి యెట్లో పరివారముతో దిగెను. ఆయన డర్బనువీధిలో నుండి వెళ్లుచుండగ ఆంగ్లేయులు గాంధిని తన్ని, కొట్టి, పొడిచి గుద్ది, తిట్టి మిక్కిలి బాధపెట్టిరి. అప్పుడు గాంధికి స్మృహ తప్పెను. అప్పుడు పోలీసుసూపరింటెండెంటు భార్య వచ్చి గాంధిని రక్షించెను. తరువాత యదార్థసమాచారములే గాంధి హిందూదేశమున తెల్పెననియు, దొరలను దూషించలేదనియు దక్షిణాఫ్రికా వాసులకు స్పష్టమాయెను. తరువాత తమదే తప్పని పత్రికాధిపతులు కూడ వొప్పుకొనిరి. ప్రజలకు గాంధిపై కోపము పోయెను. అక్రమముగ గాంధిని కొట్టినవారిపై పబ్లికు ప్రాసిక్యూటరు కేసుపెట్టదలచెను. హింసకులపైన కేసు పెట్టుటకు కూడ గాంధిమహాత్ముడు అంగీకరించలేదు. గాంధిగారి సద్భావమునకు తెల్లవారుగూడ మెచ్చుకొని మిక్కిలి సంతోషించిరి.

గాంధిగారు మన దేశములో నుండగా దక్షిణాఫ్రికాలో ప్రభుత్వమువారు మరికొన్ని బిల్లులను పెట్టిరి. ఇక భారతీయులను దక్షిణాఫ్రికాకు రాకుండచేయుట, దక్షిణాఫ్రికాలో ఉన్న భారతీయులను వ్యాపారాదులేవియు జేయకుండ అడ్డుటయు యీబిల్లుల తాత్పర్యము అందువలననే వెంటనే బయలుదేరి రావలయునని గాంధిగారికి భారతీయులు తంతివంపిరి.

తరువాత గాంధిగారు తీవ్రఆందోళనను జరిపి బిల్లులను ప్రతిఘటించిరి. గొప్ప యూరేగింపులను సభలను గూడ జరిపి సంఘసేవను వారికి నేర్పి ఐకమత్యమును వృద్ధిచేసిరి.

## 10. బోయరు యుద్ధములో సేవ.

'ట్రాన్సువాలు' దేశమునకు వలసవెళ్ళిన డచ్చివారే బోయర్లు. అందువలన బోయర్లకూడ తెల్లవారే. ఆ పోరాటములో చాలవరకు బోయర్లదే అయినను బ్రిటిషువారికే సహాయము చేయవలయునని గాంధి భారతీయులను హెచ్చరించెను. బ్రిటిషు పరిపాలన సౌఖ్యదాయకమైనదనియు, అట్టి సామ్రాజ్య సంరక్షణకై భారతీయులు సహాయపడవలయునని అప్పటి కాయన అభిప్రాయము.

యుద్ధము తీవ్రరూపము దాల్చిన వెంటనే గాంధి పటాలము నొకదానిని తయారుజేసి ఆపటాలమువలన గాయపడిన బ్రిటిషువారికి సేవజేయుట మొదలగు సహాయము లెన్నో చేసెను. అందువలన బ్రిటిషువారు గాంధిమహాత్ముని సహకారబుద్ధి కెంతయు సంతసించిరి.

చివరకు ఆ యుద్ధమున బోయర్లు ఓడిపోయిరి. అంతవరకు భారతీయులు పిరికివా రనియు, యుద్ధమునకు పనికిరా రనియు బ్రిటిషువారు తలచుచుండెడివారు. అప్పటినుండియు అట్టిది నశించి భారతీయులు సాహసవంతులనియు, అహింస పరోపకారాది సద్గుణములు కలవా రనియు బ్రిటిషువారు గ్రహించగలిగిరి. ఆవిధముగ దక్షిణాఫ్రికాలో గాంధిచే తయారు చేయబడిన పటాలము బోయరు యుద్ధములో బ్రిటిషు వారికి గొప్పసహాయముచేసిరి. చివరకు బోయర్లకును ఆంగ్లేయులకును రాజీ కుదిరినది.

1898 లో మనదేశమున గొప్ప కరువు సంభవించెను.

అప్పుడు దక్షిణాఫ్రికా భారతీయులనుండి చందాలు వసూలు చేసి మనదేశమునందలి బీదవారి కాధనము నిచ్చిరి. గాంధిజీ యొక్క సుగుణములకు మెచ్చి అచ్చటి తెల్లవారు కొంత సొమ్ము చందాచేసి ఆయనకి ఇచ్చిరి. ఈవిధముగ దక్షిణాఫ్రికాకు వలసవెళ్ళిన భారతీయులకును మనకును గాంధిమహాత్ముడు సఖ్యత కలిగించెను.

## 11. స్వదేశసేవకు మరలుట.

తరువాత గాంధి మహాత్ముని ఖ్యాతి మన దేశమునకు వ్యాపించినది. స్వదేశమునకు రావలయునని అప్పటి నాయకులు గాంధిగారిని కోరిరి. మాతృదేశసేవయే ముఖ్యమనియు, మాతృదేశమున నుండియే ఫిజీ, మారిసను, జాంజిబారు, తూర్పు ఆఫ్రికా మొదలగు దేశములకు వలసపోయిన భారతీయులకు సహాయము చేయవచ్చునని ఆయన తలంచెను. కాని దక్షిణాఫ్రికాయందలి భారతీయు లందులకు సమ్మతింపలేదు. అవసరకాలమునకు తప్పక వచ్చెదనని గాంధీ వారిని నమ్మించి 1901 లో మనదేశమునకు వచ్చెను.

1901 లో కాంగ్రెస్ మహాసభ కలకత్తాలో జరిగినది. మన కాంగ్రెసులో ఆయనకు మొదటి సంబంధమిదే. దక్షిణాఫ్రికాలో బాధలు పడుచున్న భారతీయులకు ఈసభవారు సానుభూతి తెలుపుచున్నారని గాంధి బాగుగ ఉపన్యసించెను. తరువాత 1902 లో గాంధి మహాత్మునకు గోఖలే ప్రఫుల్ల చంద్రరాయి మొదలగు నాయకులతో కలకత్తాలో స్నేహము కలిగెను. తరువాత దక్షిణాఫ్రికా సమస్యను గురించి కలకత్తా

లో గొప్ప ఆందోళన కలుగజేసి ప్రజల సానుభూతినిపొందెను. తరువాత గాంధిజీ దేశసంచారముచేసి సత్ప్రవర్తన ఆరోగ్య ము మొదలగు విషయములను ప్రజలకు బోధించుచు మన దేశముయొక్క మతరాజకీయాది విషయములలో గొప్ప అనుభవమును సంపాదించెను.

తరువాత ఆయన ప్రాక్టీసుకై రాజకోటలో కొంత కాలము నివసించెను. పిమ్మట హైకోర్టులో ప్రాక్టీసుచేయుటకై బొంబాయి వెళ్ళెను. అప్పటికి దక్షిణాఫ్రికా వర్తకులలో కొందరికి బొంబాయికోర్టులో కొన్ని కేసులు కలవు, వాటిని ఆవర్తకులు గాంధిగారికే యిచ్చిరి. ఈవిధముగ ఆయన ప్రాక్టీసు దిన దినాభివృద్ధి చెందెను. బొంబాయిలో తరుచు గోఖలేగారిని కలిసికొనుచు ఆయన సంఘసేవ పద్ధతులను గాంధి క్రమముగ నలవరచుకొనెను. ఇంతలో వెంటనే బయలుదేరి రావలయు నని నేటాలునుండి గాంధిగారికి తంతివచ్చెను. అవసమైన ఒక సంవత్సరములో తప్పక వత్తునని గాంధిగారు దక్షిణాఫ్రికా భార తీయుల కిదివరలో వాగ్దానమిచ్చెనుగదా. అందువలన గాంధి గారు నేటాలునకు వెళ్ళుట తప్పినదికాదు. దానంజేసి బొంబా యిలో ప్రాక్టీసు కట్టిపెట్టి దక్షిణాఫ్రికాకు వెళ్ళెను.

## 12. చేంబర్లేను దక్షిణ ఆఫ్రికాకు వచ్చుట.

గాంధిగారు దక్షిణాఫ్రికాకు వెళ్ళుచు గుజరాతీయువ కుల గొందరిని వ్యాసాంగాదులకై వెంట తీసుకొని వెళ్ళెను. బోయరు యుద్ధము తరువాత 'నేటాలు ట్రాన్సువాలు మొద

లగు స్వతంత్రి రాష్ట్రములు బ్రిటిషు పరిపాలకుల వశమైనవి. వాటిమీాద అధికారం బ్రిటిషు పార్లమెంటు వారిది. అప్పుడు పార్లమెంటు చేంబర్లేనును దక్షిణ ఆఫ్రికాకు మంత్రిగా నేర్పర చెను. అందువలన చేంబర్లేను దక్షిణ ఆఫ్రికా తణిఖీకి లండను నుండి వచ్చెను.

బ్రిటిషు సామ్రాజ్యవాసులగు భారతీయుల కష్టముల తొలగించుటకు చేంబర్లేనే ముఖ్యుడు. అందువలన చేంబర్లేనుకు భారతీయుల కష్టములు చెప్పవలయును. అందుకు సమర్థుడు గాంధీయే అందువలననే గాంధీని దక్షిణ ఆఫ్రికాకు రప్పించిరి. దక్షిణఆఫ్రికా ప్రభుత్వము భారతీయుల పౌరస్వాతంత్ర్యములకు భంగకరమగు క్రొత్తబిల్లుల నామోదించెను. వాటిని త్రోసి వేయుటకు చేంబర్లేనుకే హక్కుగలదు.

అందువలన గాంధిగారు చేంబర్లేనుతో సంప్రతించి ఆబిల్లులను రద్దుచేయవలయునని ఆయనను గోరిరి. అంత్యాధి కారము పార్లమెంటుదే యైనను దక్షిణ ఆఫ్రికాకు స్వతంత్రి మిచ్చితిమని చెప్పుచు చేంబర్లేను తప్పించుకొనెను. అదియును గాక లండనులోని ప్రభుత్వమువారి కప్పుడు కొంతధనము కావ లసివచ్చినది. దక్షిణఆఫ్రికా ప్రభుత్వమువారు కొన్ని లక్షల కాసులను చేంబర్లేనుకప్పుడు బహుమతిగా నిచ్చిరి. దానితో చేంబర్లేను లండనుకు చల్లగ వెడలెను.

తరువాత దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వమునకు యింకను లోకువ కలిగినది. బోయరుయుద్ధమునకై ఇంగ్లాండునుండి దక్షి ణాఫ్రికాకు వచ్చిన సైనికులు యుద్ధానంతరమునందే నివాస

ముల నేర్పరచుకొనిరి. భారతీయులేకార్యము చేసినను ఆక్రొత్త యుద్యోగుల అనుజ్ఞ పొందవలెను. చట్టము నూతనముగ పెట్టిరి. వారు మనవారిని పెట్టుతిప్పలు లెక్కలేవు. కంచియే చేను మేసిన రక్షించువా రెవ్వరుందురు.

13. ట్రాన్సువాలులో సత్యాగ్రహసమరము.

ఇట్టి దుర్భరస్థితియందున్న భారతీయులు గాంధి నక్కడనే ఆపివేసిరి. అప్పుడు ట్రాన్సువాలులో నివసించు భారతీయులకే యెక్కువ బాధలు సంభవించెను. అందువలన గాంధి ట్రాన్సువాలులోగల "జోహాన్సుబర్గు" అను పట్టణమునకు తన బస మార్చెను. కొంతకాలమైన తరువాత స్వదేశము నుండి తన కుటుంబమునుకూడ తెచ్చుకొని ట్రాన్సువాలు కోర్టులో అట్టార్నిగా ఉండెను.

దయ, సత్యము, ఆరోగ్యము, యింద్రియ నిగ్రహము, దైవభక్తి, మతము వీనిని గురించి అక్కడ గాంధి తరుచు ప్రజలకు బోధించుచుండెను. ఆయనకీర్తి దినదినాభివృద్ధి చెంది ఆయనలో గొప్ప మహత్మ్యము ముద్భవించెను.

నేటాలులో 'జూలు' అను నల్ల ఆదిమజనులు కలరు. అప్పుడు వారు ప్రభుత్వముమీద తిరుగుబాటు చేసిరి. ఆసమయమున గాంధిగారు 40 మంది భారతీయుల నొక సంఘముగ నేర్పరచి, ఆసంఘమున గాయపడిన జూలులకు చికిత్సచేయ నియమించెను. తెల్లవారు నల్లవారి కులపచారములు చేయుట కేవగించుకొనిరి. ఆవిధముగ అక్కడి భారతీయు జూల అభిమానమునకు పాత్రులైరి. ఆకాలములో ట్రాన్సువాలు నందు

ప్లేగువ్యాధి వ్యాపించినది. గాంధీగా రప్పుడు స్వయముగా చికిత్సను ఉపచారములను జేసెను. ఇంగ్లీషు వైద్యము పద్ధతిని టాయిూకూనెగారి సిద్ధాంతముల ననుసరించి రోగులకు జలవైద్యము, మట్టిపూతవైద్యముచేసి సాత్వికాహారమే పెట్టి ప్లేగువ్యాధి నద్భుతముగ గుదిర్చెను. అందువలన నేటాలు ప్రజలు గాంధీయందధిక భక్తివిశ్వాసములు కలిగియుండిరి.

తరువాత గాంధీ "ఇండియన్ ఒపినియన్" అను వారపత్రిక నొకదానిని స్థాపించెను. ఆంగ్లము, గుజరాతి మొదలగు దేశభాషలలో నడుప నారంభించెను. పిమ్మట 'ఫయినిక్సు' అను ప్రదేశమున ఒక విశాలమగు ఆశ్రమము నిర్మించి తనపత్రికను అచటనుండియే నడుపప్రారంభించెను. చివరకు ఆ ఆశ్రమము ప్రజాసేవకు కేంద్రస్థానమైనది. ఆ ఆశ్రమములో పోలకు వెస్టు మొదలగు యూరపియనులుకూడ కుటుంబముల సహితముగ నివసించుచుండెడివారు. అందు గాంధీగారు బాలురకు స్వయముగ విద్య నేర్పెడివారు.

బోయరు యుద్ధానంతరము దక్షిణఆఫ్రికా యందలి రాజ్యములను 1907 బ్రిటిషు సామ్రాజ్యములో కలిపి యూనియన్ ఆఫ్ సౌతాఫ్రికా యని పేరుపెట్టి స్వపరిపాలిత దేశముగ జేసిరి. కాని, అక్కడ పరిపాలన తెల్లవారికే ఒప్పజెప్పిరి. తెల్లవారు భారతీయులను మిక్కిలి కష్టముల పెట్టుచుండిరి తరువాత గాంధిగారు ఇంగ్లండునకు వెళ్ళి దక్షిణాఫ్రికాలో జరుగు అన్యాయములను ప్రభుత్వముతో చెప్పిరి. కాని చివరకు అది నిష్ప్రయోజన మయ్యెను.

దక్షిణాఫ్రికాకు స్వపరిపాలన రాగానే 'ఆసియా' వారి వలన సవరణ చట్టమొకదానిని అమలులో పెట్టిరి. దాని ననుసరించి ప్రతి ఆసియా మనుష్యుడును సంవత్సరమునకు మూడుకాసుల తలపన్ను చెల్లింపవలెను. మరియు వ్రేలుముద్ర వేసి తనపేరు గవర్నమెంటు రిజిష్టరులో రిజిష్టరు చేయించుకొనవలయును. విద్యావంతులగు భారతీయులు దక్షిణాఫ్రికాలో నివసించకూడదనియు మరియొక చట్టము చేసిరి. ఈ అన్యాయ చట్టములను గురించి గొప్ప ఆందోళన జరిగెను. చేయునది లేక చివరకు గాంధిగారు సత్యాగ్రహము ప్రారంభించిరి. గాంధీగారు సత్యాగ్రహముచేయుట కిదియే ప్రథమము. తలపన్ను చెల్లింపకూడదనియు వ్రేలుముద్రలు వేయకూడదనియు గాంధీగారు బోధించిరి. ఈ సత్యాగ్రహములో చీనావారుకూడా పాల్గొనిరి.

అందువలన 1907 లో గాంధిని అరెస్టుచేసిరి. జైళ్ళు నిండెను. ఆస్తులు పోయినను ఎవరు పన్ను చెల్లించలేదు. సమస్తజనులు గాంధీగారియందు విశ్వాసము గలవారై యైక మత్యముతో నాయన ననుసరించిరి.

అంతట ప్రభుత్వమువారు చేయునది లేక తల పన్ను ఒకసారి చెల్లించిన చాలుననియు నిదివరలో చెల్లించినవారు ఇక నీయనక్కర లేదనియు, భారతీయులు తమంతట రిజిష్టరు చేయించుకొన్న చాలుననియు, శాసనములను మార్చి గాంధీగారితో రాజీపడిరి. ఇట్టిరాజీ కొంతమందికి తృప్తికరముగ లేదు. ఈవిధముగ రాజీకుదిరిన పిమ్మటకూడ ప్రభుత్వము ఆచట్టములను రద్దుచేయక క్రొత్తనిర్బంధ చట్టములను గూడ

పెట్టబోయిరి. ఇట్టి అధర్మ పరిపాలనకు గాంధిగారేవగించుకొని మరల 1908 లో సత్యాగ్రహమును ప్రారంభించిరి. ఈసత్యాగ్రహమునకు మన దేశము సానుభూతిని జూపెను. బొంబాయి కలత్తా, మద్రాసులలో వేలకొలది రూపాయిలు చందాచేసి దక్షిణాఫ్రికా సత్యాగ్రహుల సహాయమునకై పంపిరి. ప్రభుత్వమువారు ఈతరవిచిత్రశిక్షల నమలులో పెట్టిరి. కాని సత్యాగ్రహము దినదినాభివృద్ధి చెందెను. అమెరికావారుకూడ దక్షిణాఫ్రికా ప్రభుత్వము చర్యను ఖండించిరి. చేయునదిలేక 1913 లో ప్రభుత్వము గాంధితో రాజీపడి ఆచట్టములను రద్దుపఱచుకొనిరి.

## 14. మన దేశ స్థితి.

1906 లో దాదాబాయి నౌరోజీగారు కాంగ్రెసునకు అధ్యక్షులయ్యెను. ఆయన విదేశ వస్తుబహిష్కారము. స్వరాజ్యము బోధించిరి. 1907 లో మితవాదులకును జాతీయవాదులకును చీలిక కలిగెను. జాతీయవాదులకును ప్రభుత్వము కఠినముగ శిక్షించి నాయకుడైన తిలకుగారిని 1908 లో ఆరేండ్లు శిక్షించెను. వంగరాష్ట్ర నాయకుడైన లజపతిరాయిగారిని విచారణ చేయకయే జైలులో పెట్టిరి. క్రిమినలులా నవరణచేసిరి. ముద్రాలయములకు క్రొత్తనిర్బంధనల నేర్పరచిరి. ప్రజలుభయపడిరి. గోఖలే దేశభక్తికలవాడైనను కార్యశూరుడు కాడు. అట్టితరి గాంధీగారిని మాతృదేశసేవకై మనదేశము రావలయునని నాయకులు పెక్కురు కోరిరి.

అందువలన యూరపులోనున్న గోఖలేతో మాట్లా

డుటకు గాంధి 1914 లో లండను వెళ్ళెను. అంతట జర్మను మహాయుద్ధము తటస్థించెను. బ్రిటిషు సామ్రాజ్యము లోకోప కారమైనదని అప్పటికి గాంధిగారు నమ్మి ఇంగ్లండులోని భార తీయులను లండనులో సమకూర్చి ఇంగ్లండుకు ఆయుద్ధములో సహాయము చేయవలయునని వారికి హెచ్చరించిరి అందులకై గాంధికొంత సేవాదళమును సమకూర్చెను. కాని బ్రిటిషు ప్రభుత్వమువారు ననేక కష్టములు పెట్టెను. అందులకు ఆ సేవాదళము చిన్న సత్యాగ్రహముచేసి పని మానెను. తరు వాత గాంధిగారు 14 రోజులు ఉపవాసదీక్ష వహించిరి. పిదప మహాత్ముడు జబ్బుపడుటవలన ఆయుద్ధమున నేమియు జోక్య ముకలుగజేసుకొనలేదు. పిదప 1914 లో గాంధియును గోఖలే యును బొంబాయిచేరిరి. అప్పుడు జిన్నా మొదలగు గుజ రాతీయులు గాంధిగారికి గొప్ప సన్మానమిచ్చిరి.

తరువాత గాంధి గోఖలేలకు కొన్ని అభిప్రాయభేదము లుకలిగెను. గోఖలే మితవాది, ప్రభుత్వముతో సంఘర్షణ యనునది ఆయనకు గిట్టదు. సాంఘిక రాజకీయములను సన్ని హిత సంబంధము కలదు. మనకును విదేశీయులకును ముఖ్య విషయములలో పోటీలు రావచ్చును. అప్పుడు మనము వెను కంజ వేయరాదు. కనుక దక్షిణాఫ్రికా పద్ధతి ననుసరించి, స్వతంత్రాశ్రమము పెట్టి స్వాతంత్ర్యమునకై పోరాటము సలుప వలయునని గాంధిగారు నిశ్చయించిరి.

### 15. సబర్మతీ ఆశ్రమ నిర్మాణము.

ఆశ్రమ మెచ్చట నిర్మింపవలయునా యని గాంధి ఆలో

చించుచుండెను. తరువాత కొంతకాలమునకు గోఖలే పూనాలో మరణించెను. అందువలన ఆసంఘము ను గాంధియే నడుపవలసి యున్నది. ఆ సంఘమువారు మితవాదులును సత్యాగ్రహము గిట్టనివారును గనుక గాంధి ఆసంఘముతో సంబంధము కలుగ జేసికొనలేదు.

తరువాత మనదేశపు స్థితిగతులను పూర్తిగ తెలిసికొను నుద్దేశము గాంధిగారు ఆసేతుహిమాచల పర్యంతమును గల ప్రదేశములన్నియు దిరిగి అవసరమైనచోట్ల ప్రజాసేవ జేసెను. ఆ సంవత్సరము హరిద్వారమువద్ద కుంభమేళపు టుత్సవము జరిగెను. గాంధిగారు అనుచరులతో అచ్చటకు వెళ్ళి ఉచితరీతిని సంఘసేవ జేసిరి. రైలులో మూడవ తరగతియందు ప్రయాణ ముచే రైలులో కలుగుచున్న కష్టముల గురించి రైల్వే ఉద్యోగస్తులకు నివేదించిరి.

ఈవిధముగ దేశసంచారము చేసి 1915 లో గుజరాతు దేశమునకు ముఖ్యపట్టణమైన అహమ్మదాబాదు నగరము ప్రక్క ప్రవహించుచున్న సబర్మతీ తీరమున గాంధిమహాత్ముడు ఒక ఆశ్రమమును నిర్మించెను. ఆ ఆశ్రమవాసుల ముఖ్యసిద్ధాంతము సత్యాగ్రహ మగుటంజేసి దానిని 'సత్యాగ్రహాశ్రమ'మని పేరువచ్చెను.

కార్యశూరులు, అస్పృశ్యత' యనునది పాటింపని వారును, అహింసావ్రతులును, సత్యవాక్పరిపాలకులును, నిందు సదా నివసించుచుందురు. ఆ ఆశ్రమమునకు వర్తకులు, ప్లీడర్లు మొదలగు ధనికు లెంతయో ధనసహాయమును జేసిరి. తరువాత

మూడు సంవత్సరముల వరకు గాంధీగారు రాజకీయము లందంతగా సంబంధము కలుగ జేసుకొనలేదు. ఇండెంచరుపద్ధతి తీసివేయవలయుననియు, లేనియెడల సత్యాగ్రహము ప్రారంభించెదననియు, గాంధిగారు 1917 లో తెలిపెను. తాను చెప్పినది తప్పక చేయునని గవర్నమెంటువారికి తెలియును. అందువలన సర్కారువారు వెంటనే ఇండెంచరుపద్ధతి నాపివేసిరి.

సబర్మతీ ఆశ్రమములో 20 కుటుంబములవారు కాపుర మారంభించిరి. అందునివసించువారు జాతిమతవైషమ్యములు లేక సహోదరులవలె మెలగుచుండిరి.

## 16 చంపారణ సత్యాగ్రహము.

ఉత్తర హిందూస్థానమున బీహారు రాష్ట్రములో 'చంపారణ' యను జిల్లాకలదు. అందు నివసించు జనులు అనాగరికులు కాని, చంపారణ యందలి భూమి మిక్కిలి సారవంతమైనది. ఆ భూములయందు నీలిరంగు తయారుచేయుట కుపయోగపడు నీలియాకు విస్తారముగ పండును. అందు చాల భాగము ఆంగ్లేయులు మిక్కిలి చవుకగకొని రయితులవలన నీలియాకు పండించి అధిక ధనవంతు లగుచుండిరి. 10 ఎకరముల భూమిలో సుమారు రెండుయెకరముల పంట రయితులు దొరల కీయవలయును. అట్టి అక్రమమగు పన్నుల నెన్నియో చెల్లింపవలయును.

తమ దుస్థితిని బాపుటకై గాంధిని ఒక రయితు ప్రార్థించెను. అందువలన 1917 లో గాంధి చంపారణకువెళ్ళి అక్కడి విషయముల బాగుగ గ్రహించెను. గాంధి యేమిచేయునో యని ఆంగ్లవర్తకులు భయపడి ఆజిల్లా మేజస్ట్రేటు నాశ్రయిం

చిరి. వెంటనే ఆమేజస్ట్రేటు గాంధిపై 144 వ సెక్షను ప్రయో గించెను. గాంధి ఆజిల్లానుండి కదలలేదు. తరువాత పోలీసు వారు కేసుపెట్టిరి. రయితు కష్టములు తొలగించుటకు మేజ స్ట్రేటు ఆజ్ఞను నిరాకరించితినని గాంధి కోర్టులో స్టేటుమెంటు పెట్టెను. అంతట నీవిషయమై దేశమం దంతటను గొప్ప ఆందో ళన కలిగెను. కోతిపుండు బ్రహ్మరాక్షసి యగునని గవర్న మెంటు గ్రహించి వారాకేసును రద్దుచేసిరి.

తరువాత గవర్న మెంటువారు చంపారణజిల్లా రయితుల కష్టములను విచారించుటకొరకు సంఘము నేర్పాటుచేసి అందు గాంధినికూడ ఒక సభ్యునిగ నియమించిరి. రయితులకు పెక్కు అన్యాయములు జరుగుచున్న వనియు వారికష్టములను ప్రభు త్వము తప్పక తొలగింపవలయు ననియు ఆసంఘమువారు తీర్పు చెప్పిరి.

ఆతరువాత ప్రభుత్వము చేయునది లేక రయితు లద నపు పన్నులు చెల్లింపనక్కర లేదనియు, నీలి నుచితముగ నీయ నక్కర లేదనియు తీర్పు చెప్పిరి. ఈవిధముగ గాంధి మహా త్ముడు మనదేశమున సత్యాగ్రహము చేసి జయముపొందెను. మనదేశమున సత్యాగ్రహము చేయుటకిదియే ప్రథమము.

## 17 అహమ్మదాబాదు మిల్లు సమ్మె

అహమ్మదాబాదులో మిల్లులు పెక్కుగలవు. 1918 లో కింబలు ధరలు పెరుగుటవల్లన ఆమిల్లులలో పనిచేయు కూలీలు తమకూలి హెచ్చింపుడని యజమానులను కోరిరి. కాని యజ మానులందు కంగీకరించలేదు. అందువలన పనివాండ్రు విధి

లేక సమ్మెకట్టిరి. అంతట గాంధిగారు చంపారణమునుండి వచ్చిరి. మిల్లు పనివాళ్ళు గాంధిని నాయకత్వము వహింపకోరిరి. గాంధి అందుల కంగీకరించెను. మిల్లు యజమానులుగూడ గుజరాతు లయినను గాంధి న్యాయమార్గ మవలంబించెను.

శాంతముగ నుండవలయునని, సమ్మెకాలమున మిల్లునం దితరులు పనికి ప్రవేశించినను వారిని బాధింపగూడ దనియు, సమ్మె ముగియువరకు నేత, వ్యవసాయము, వడ్రము మొద లగు పనులుచేసి జీవింపవలయుననియు గాంధి సమ్మెదారులకు హితబోధ చేసెను. రాజీయనంతరమునగాని తిరిగి మిల్లులలో పనిచేయరాదనియు, చందామూలమున జీవి పరాదనియు గాంధి జెప్పెను.

మిల్లుదారులు మిక్కిలి ధనవంతులు. మిల్లులు కొన్ని నెలలు ఆగినను రాజీకి రామని నిష్కర్షగ జెప్పిరి. పనివాండ్రు మిక్కిలి బాధపడుచుండిరి. కొంతమంది సత్యాగ్రహ వ్రతము నకు భిన్నముగ తిరిగి మిల్లులో చేర నమకట్టిరి. కొంతమంది క్రొత్తపనివాండ్రను బాధింపబోయిరి. దీనరక్షాపరుడగు గాంధి చేయునదిలేక ఉపవాసదీక్ష ప్రారంభించెను. అప్పుడు యీవిష యమై దేశమంతటను గొప్ప ఆందోళనకలిగినది. సమ్మెదార్లు పూర్వముకన్న రెట్టింపు ఉత్సాహముతో సమ్మె జయప్రద ముగ సాగించిరి.

ఆవిధముగ 3 దినములు ఉపవాసము జరిగిన తరువాత మధ్యవర్తులు చెప్పినట్లు ఆమిల్లుయజమానులు సమ్మెదారుల జీతముల హెచ్చించి ఆపనివాండ్రను తిరిగి తమతమ మిల్లు లలో పనికి పెట్టుకొనిరి. మిల్లు యజమానులు గాంధిగారి

సత్ప్రవర్తన కచ్చేరుపొందిన నాటినుండియు గాంధిమహాత్ముని సలహా ననుసరించి ప్రవర్తించుచుండిరి. అహమ్మదాబాదులో బీదలగు కూలీలు సౌకర్యముగ నుండుటకు గాంధీజీ ముఖ్యకారకుడు.

## 18. ఖేరా సత్యాగ్రహము.

పై విధముగ మిల్లు సమ్మె పూర్తియైన వెంటనే మరి యొక సమస్య వచ్చెను. 1918—1919 సంవత్సరములలో గుజరాతు దేశమున ఖేరాయను జిల్లాయందు పంటలేక గొప్ప కరువు సంభవించెను. సర్కారువారు పన్నులకై రయితుల పెక్కు బాధలను పెట్టసాగిరి. రయితులదగ్గర డబ్బు లేదు. శ్రీ విఠలుబాయి పటేలు మొదలగు నాయకులు ఆసంవత్సరము పన్నుల రద్దుచేయువలయునని సర్కారుతో వాదించిరి. కాని చివరకు నిష్ప్రయోజన మయ్యెను. పంట పాతికకు తగ్గిన పన్నులు కొట్టివేయువలయునని సర్కారు రూలు కలదు. ఆ సంవత్సరములలో పంటలు పాతికవంతుకూడ లేవు. సర్కారు ఉద్యోగస్తులు పంట బాగుగ పండినదని వాదించెడివారు. కాని విషయమును బహిరంగముగ విచారించుటకు అంగీకరించెడి వారుకారు. ఉద్యోగస్తులు రయితులను పన్నులకై బాధపెట్ట సాగిరి. అత్తరి వేరు శరణ్యములేక రయితులను గాంధిగారిని ఆశ్రయించిరి. రయితుల వాదన న్యాయమని మహాత్ముడు తెలిసికొని సర్కారుతో సంప్రతించి ఫలమును పొందలేక గోవిందుడు గోవర్ధనగిరి నెత్తిన చందమున సత్యాగ్రహసమర ప్రారంభమునకై జెండా నెత్తెను. భగవంతుడు న్యాయపక్ష

పాలి గదా ! అందువలన చివరకు యీ సత్యాగ్రహమున కూడ గాంధిమహాత్ముడు జయము పొందెను. జైలు కంపినను, ఆస్తులు జప్తుచేసి వేలమువేసినను సర్కారు పన్నులు వసూలు చేయలేకపోయిరి. అహమ్మదాబాదులో బారిస్టరుగ పనిచేసి ప్రసిద్ధిజెందిన వల్లభాయిపటేలు తన వకీలుపని మానుకొని గాంధీకి కుడిభుజమై యీ సత్యాగ్రహమున పనిచేసెను.

ప్రభుత్వము యెంత దౌర్జన్యము చేసినను పన్నులు వసూలు కాలేదు. చివరకు ప్రభుత్వమువారు గాంధీగారితో రాజీపడిరి. బీదలు పన్నులు చెల్లించనవసరము లేదనియు, భాగ్యవంతులు మాత్రము పన్నులు చెల్లింపవలయు ననియు ఆ రాజీ పర్యవసానము.

అప్పటినుండియు దేశమున సత్యాగ్రహమునం దెక్కువ నమ్మకము కలిగినది. దానితో గాంధిగారి ఖ్యాతి భూవలయమున హెచ్చెను. తరువాత ఖద్దరువ్యాప్తి, భాషావ్యాప్తి, మొదలగు కార్యములు జయప్రదముగ జరిగింపబడినవి.

## 19. జలియవ్వాలాబాగు దురంతములు.

1918 లో యూరపు మహాయుద్ధము ముగిసెను. యుద్ధకాలమున తిలక్, బిసెంటు, ఆలీసోదరులు మొదలగు వారిని ప్రభుత్వము జైలులో పెట్టెను. ఎవరి దేశమును వారు యిష్టమొచ్చినట్లు పరిపాలన చేసుకొను హక్కునకై యుద్ధముచేయుచున్నామని సర్కారు ప్రకటించిరి. యుద్ధానంతరము మనకు కూడ స్వపరిపాలన లభించునని కొందరు నమ్మిరి. గాంధిగారు కూడ అనేకవిధముల సర్కారుకు తోడ్పడిరి. అంతలో మహా

త్మునకు జబ్బుచేసెను. అంతట 1918 లో యుద్ధము రాజీయైనది.

యుద్ధానంతరము సర్కారు మనకు స్వపరిపాలన మొసంగుటకుమారు విచిత్రమగు మాంటుఫర్డుచట్టమొక దానిని అమలు జరిపిరి. ఆ చట్టము వలన హిందువులలో కొంతమందికి శాసన సభలలో సభ్యత్వము, కొందరికి మంత్రిపదవులును లభించినవి. కాని, వారికి పూర్తి అధికారములేదు. ఇట్టి మాయసంస్కరణ వలన ప్రజలలో హిందూమహమ్మదీయు వైషమ్యము పెచ్చు పెరిగినది, ఓటింగువలన ప్రజలలో కలహములు సంభవించెను. ఆ విధముగ దేశము సంఘీభావము నశించెను. మరియు ప్రజా స్వాతంత్ర్యము రూపుమాపుటకై సర్కారు రౌలటుచట్ట మొకదానిని ప్రవేశపెట్టిరి.

అంతట గాంధి కోపించి రౌలటుచట్టమును ఖండించుచు 1919 మార్చిలో సత్యాగ్రహము ప్రారంభించెను. దేశమునం దంతటను హర్తాళములు గొప్పగొప్ప సభలు జరిపి సర్కారు చర్యల కసమ్మతి దెలిపిరి. సర్కారు కొందరిని అరెస్టుచేసిరి. సభలపై అశ్వికుల దాడినంపిరి. పంజాబునందలి సత్యపాలు, దనిచెంద మొదలగు వారిని సర్కారు అరెస్టుచేసిరి. పంజాబునకువచ్చిన గాంధిని సర్కారు అరెస్టుచేసిరి. బొంబాయిలో దింపిరి. చివరకు అసత్యాగ్రహము తీవ్రరూపముదాల్చి అహింసాసిద్ధాంతము నశించి కొన్నిచోట్ల రక్తమయ్యెను.

13 ఏప్రిలు 1919 లో అమృతసరము మధ్య 'జలియన్వాలాబాగు' తోటలో శాంతముగ సభచేయుచున్న నిరా

యుధ భారతీయులను ప్రభుత్వసేనాని దయారహితుడై మర ఫిరంగులతో కాల్చి చంపెను. పంజాబుదేశమున సర్కారు సైనిక శాసనముల ప్రయోగించెను.

తరువాత చిత్తరంజనదాసు, మోతీలాలు నెహ్రూ, మాలవ్య, జయకర్ మున్నగు సుప్రసిద్ధనాయకు లావిషయము విచారించి తప్పు సర్కారుదే యని నిర్ణయించినను ప్రభుత్వము చలించలేదు. ఉద్యోగస్తులను శిక్షించలేదు సరికదా సరియగు విచారణనైనను జరిపియుండలేదు.

20. యంగు ఇండియా పత్రిక.

1919 ఏప్రిలులో ' యంగు ఇండియా ' పత్రికను గ్రహించి గుజరాత్ లో ' నవజీవన్ ' అను వారపత్రికను అహమ్మదాబాదు నుండి నడుప ప్రారంభించిరి. హిందీలో కూడ ' నవజీవను ' వారపత్రిక స్థాపించిరి. ఈ పత్రికను సుమారు 40 వేలవరకు చందాదారులుండెడివారు. యంగు ఇండియా యందలి వ్యాసముల మన దేశ వార్తాపత్రిక లన్నిటియందును వ్రాయుచుండెడివారు.

యంగు ఇండియా నవజీవనులయందు తరుచు సత్యాగ్రహ పద్ధతులు, అహింస, అస్పృశ్యతా నివారణ హిందూ మహమ్మదీయ స్నేహము, ఖద్దరు మొదలగు విషయములను గురించి ప్రచారము చేయుచుండెడివారు.

గాంధి కార్యశూరుడు, యింద్రియ నిగ్రహుడు. దేశ భక్తాగ్రేసరుడు, పట్టుదల స్వభావము కలవాడని ఒకహిందూ దేశమునకే గాక లోకమున కంతకును విశదమయ్యెను. జలి

యన్ వాలాబాగు హత్యలో చనిపోయినవారి జ్ఞాపకార్థమై గాంధిగారు బొంబాయిలో చాలసొమ్ము చందాగా వసూలు చేసి స్మారకచిహ్నముల నెన్నిటినో యేర్పరచెను.

మరియు జాతీయకార్యముల నాయన చందాసొమ్ముతో నిర్వహించి యున్నారు. ప్రతిదినము గాంధిమహాత్ముడు దేశ సేవకై పాటుపడి అనేక కష్టములకు లోనై కాంగ్రెసు చేయు తీర్మానముల దేశమునందమలు జరుపుచు, కార్యవర్గము వారికి తగు సలహా నిచ్చుచుండును.

## 21. నాన్-కో-అపరేషను.

సర్కారు అన్యాయప్రవర్తనకు గాంధి కోపించి 1919 లో నాన్-కో-అపరేషను ప్రారంభించెను. ప్రభుత్వమునకెట్టి సహాయమును జేయకుండుటే దాని ముఖ్యాభిప్రాయము. 1920 లో ముందు మహమ్మదీయులా సిద్ధాంతమును అంగీకరించిరి. 1920 లో కాంగ్రెసు మహాసభ కలకత్తాలో జరిగెను. తరువాత డిశంబరులో నాగపురమున కాంగ్రెసు వార్షికసభ జరిగెను. ఈరెండు సభలయందును గాంధి ప్రవేశపెట్టిన నాన్-కో-అపరేషను (అసహాయము) తీర్మానము నాయకులచే సంపూర్ణముగ అంగీకరింపబడినది.

ఆతీర్మానము ననుసరించి పాఠశాలలను, కాలేజీలను కోర్టులను, విదేశవస్త్రములను, విదేశవస్తువులను, శాసనసభలను బహిష్కరింపవలయునని స్థిరపరచిరి. కాంగ్రెసు స్వరాజ్యమును న్యాయముగ సంపాదింపవలెనని నిశ్చయించిరి. "స్వరాజ్యము బ్రిటిషు రాజ్యాంగములోపల సంపాదింపవలయుననియు, అట్ల

సాధ్యమైన సామ్రాజ్యముతో సంబంధములేకుండ స్వపరిపాల నము సాగించుటయే" అని గాంధి నిర్వచనము గావించెను.

పిదప బజాజు, టాగూరు, దాసు, నెహ్రూ, రాజేంద్ర ప్రసాదు, ప్రకాశం, శ్రీనివాస అయ్యరుగారు మొదలగు ప్రముఖులు భోగములు త్యజించి వేలకొలది రూపాయల రాబడినివి వదలుకొని రాజకీయరంగమున గాంధిమహాత్మునకు సహాయకు లయిరి. అంతట గాంధి దేశమంతటను తన కార్యక్రమమును గురించి బాగుగ ప్రచారము చేసెను. తన్మూలమున గాంధి మహాత్మ్యము భూవలయమునందంతటను వ్యాప్తిజెందెను.

1921 లో నాన్-కో-ఆపరేషను తీర్మానము ననుసరించి కాంగ్రెసు వాలంటీర్లు, కలుపాటను విదేశపుబట్టల దుకాణము లను పట్టుదలతో 'పికెటింగు' చేయుచు దేశకార్యక్రమమును జయప్రదముగ సాగించిరి. అందువలన ప్రభుత్వపు ఆదాయ మును, సీమవ్యాపారుల లాభమును తగ్గెను. అంతట సర్కారు కోపించి 'పికెటింగు' చేయువారిని అరెస్టుచేసిరి. ఈవిధముగ జరుగునని గాంధిగారికి ముందే తెలియును. దానిని ప్రతిక్రియగ గాంధి 'శాసన ధిక్కారము' నములులో పెట్టెను. అందుకు మహమ్మదీయులుకూడ మనవారికి తోడ్పడిరి. ప్రజలలో తిరిగి రాజభక్తిని కలుగజేయుటకు సర్కారు బ్రిటిషు యువరాజును దేశసంచారము చేయించిరి. ప్రజలాయుత్సవములో పాల్గొన వలయునని సర్కారు హెచ్చరించిరి. గాంధి మొదలగు నాయ కులు ఆ ఉత్సవములను బహిష్కరించిరి. అప్పటి వైస్రాయి

రీడింగు ప్రభువు చేయునదిలేక గాంధిగారితో రాయభారము మొదలుపెట్టెను. ఉత్సవములు జయప్రదముగ జరుగుటలేదు. గాంధి ప్రజల హక్కులను మన్నింపవలయు ననియు ముస్లిం నాయకులగు 'అలీ' సోదరులను జైలునుండి విడిచిపెట్టవలయు ననియు రీడింగు ప్రభువును కోరిరి. వైస్రాయి అందుల కంగీకరించలేదు ఆదినమున గొప్ప హర్తాళములు జరిగినవి. అందు ప్రజలకు పోలీసుఉద్యోగస్తులకును తీవ్రసంఘర్షణలు చెలరేగినవి. తన్మూలముగ పోలీసువారు లాటీలతో ప్రజలను కొట్టి కొందరిని తుపాకులతో కాల్చి చంపిరి. హర్తాళము జయప్రదముగ జరిగినను ప్రజలకింకా అహింసాతత్వము పూర్తిగ బోధపడలేదని గాంధి గ్రహించి సత్యాగ్రహమును తాత్కాలికముగ వాయిదాచేసెను

ఖద్దరు, అహింస, అస్పృశ్యతా నివారణ వీటిని జనులు బాగుగ వ్యాపిజేసిన ఒక సంవత్సరములో తప్పక స్వరాజ్యము లభించునని 1921 లో గాంధి దేశమంతయు తిరిగి గొప్ప ప్రచారము చేసెను.

తరువాత గాంధి కోటిరూపాయలు చందాచేసి రాట్నములు పెట్టించెను. కాని దేశముఅహింస, అస్పృశ్యతానివారణ యింకను బాగుగ వ్యాపిజెందవలసి యున్నది.

1921 లో అహమ్మదాబాదులో జరిగిన కాంగ్రెసులో నాన్-కో-ఆ-రేషను స్థిరపరచి ప్రభుత్వము సంస్థల బహిష్కరించి పంచాయితీ కోర్టులను నెలకొల్పుటకు తీర్మానించిరి.

1—2—1922 తేదీని శాసనోల్లంఘనము గావింతుమనియు, పన్నులు చెల్లింపమనియు, గాంధిగారు రీడింగు

ప్రభువునకు తెలియజేసిరి. అందులకుగాను గుజరాతున సూరతు జిల్లాలో బార్డోలీ రైతులను సత్యాగ్రహమునకు సిద్ధముచేసెను బార్డోలీరైతులు ఎట్టికష్టములను సంభవించినను సత్యాగ్రహ సమరమును జయప్రదముగ నడుపుటకు సంసిద్ధులైరి.

## 22. యరవాడ జైలు.

అంతలో 5-12-1922 తేదీని సంయుక్త రాష్ట్రములో చౌరచౌరాలో ప్రజలు పోలీసువారి గృహముల దగులబెట్టుట వలన కొందరు పోలీసువారు చనిపోయిరి. అప్పుడే మద్రాసులో కూడ కొన్ని అల్లరులు జరిగినవి దాని వలన అహింసాసిద్ధాంత మింకను ప్రజలకు బాగుగ బోధపడలేదని గాంధిగారు సత్యాగ్రహమును ఆపుచేసిరి. అప్పుడు గాంధిగారిని కొందరు హేళన జేసిరి. ముఖ్యముగ బార్డోలీ ప్రజలు నిరుత్సాహమును జెందిరి.

తరువాత యంగు ఇండియాలో గాంధివ్రాసిన వ్యాసములకై ఇం. పి. కో. 124 ఎ సెక్షను ననుసరించి 12-5-1922 తేదీని గాంధిగారిని సబర్మతీ ఆశ్రమమున అరెస్టు చేసెను. సెషన్సుజెడ్జి బ్లూ ఫీల్డువారు ఆ కేసు విచారించి 18-3-1922 తేదీని గాంధిగారి కారేండ్లు శిక్ష విధించెను.

తరువాత దేశమున పరస్పర విరోధములు పెచ్చు పెరిగెను. హిందూ మహ్మదీయ కలహములు హెచ్చెను. బ్రాహ్మణులకును తదితరులకును అసూయత వృద్ధిజెందెను.

1924 లో గాంధిగారికి గొప్ప జబ్బుచేసెను. 'మేడల్' అను డాక్టరు గాంధిని హాస్పిటలుకు తీసుకుపోయి శస్త్రచికిత్స చేసి ఆ

జబ్బును *ష్టముమీద నివారణచేసెను. తరువాత 5–2–1923 తేదీని ఎట్టిషరతులు లేకయే గాంధిని సర్కారు విడుదలజేసెను.

తరువాత దేశమున మతకలహములు వృద్ధియగుటవలన గాంధి 21 దినములు ఉపవాసముజేసెను. అంతట అన్నిమతిముల నాయకులును నొకచో పంచాయితీజేసి గాంధిగారిని అధ్యక్షునిగ నియమించిరి. మతకలహములు తటస్థించినప్పుడు ఆ పంచాయితీ చెప్పినట్లంగీకరించుట కందరును సమ్మతించిరి.

## 23. బెల్గాం కాంగ్రెసు అధ్యక్షత.

పిదప 1923 లో జరిగిన శాసనసభల యెన్నికలలో స్వరాజ్యపార్టీవారు పాల్గొని కొందరు సభ్యులయిరి. శాసనసభలలో పాల్గొనకూడదని విమోధపక్షమువారు తీవ్రప్రచారము కొనసాగించిరి. చివరకు గాంధిగారు ఆరెండుపక్షముల నెట్లో యేకము చేయగలిగిరి. తరువాత గాంధిగారు 1924 లో కాంగ్రెసు మహాసభ కధ్యక్షులై శాసనసభలలో ప్రవేశించుటకు పూర్తి అధికారమును కలుగజేసిరి. ఖద్దరు, మద్యనిషేదము హిందీవ్యాప్తి మొదలగు నిర్మాణకార్యక్రమమును కాంగ్రెసు దేశమున బాగుగ వ్యాపింపజేసెను. అందువలన సర్కారుకు అపారనష్టము కలుగుట వలన 1924 లో సర్కారా పార్టీ సభ్యుల నరెస్టుచేసెను. 1925 లో చిత్తరంజనదాసు జబ్బుచే చనిపోయెను. ఇట్టి పరిస్థితిలో గాంధి 1925 లగాయతు 1928 వరకు దేశమునందన్ని ప్రాంతములను రాట్నపుపరిశ్రమ మిక్కిలి యభివృద్ధి జేసెను. 1928 లగాయతు జవహార్లాలు స్వరాజ్యమునకై తీవ్రప్రచారము జేసెను. తరువాత నా సంవత్సరం

ముందే మోతీలాలు అధ్యక్షతక్రింద నొక కమిటీ యేర్పడెను. అది తయారుచేసినదియే నెహ్రూకమిటీ రిపోర్టు 1929 లో జవహర్లాలు లాహోరు కాంగ్రెసు మహాసభ కధ్యక్షుడై పూర్ణస్వాతంత్ర్య తీర్మానమును సభ్యులచే నామోదింపజేసిరి. వెంటనే సమిష్టి శాసనోల్లంఘనము ప్రారంభింపవలయునని ఆ మహాసభ తీర్మానించి గాంధిగారి నందుకు డిక్టేటరుగ నియమించిరి. ప్రజాక్షేమ కరమగు నీక్రింది పనులు సర్కారు చేయుదు మని వాగ్దానము చేయని యెడల శాసనోల్లంఘనము నారంభింతు మని వైస్రాయికి గాంధి తెలియజేసెను.

షరతులు.

1 దేశమున కల్లుదుకాణము లెత్తివేయవలయును.
2 కాను ధర రు 15 లుగ నిర్ణయించవలయును.
3 భూమిపన్ను సగముకు తగ్గించి, భూమిశిస్తులపైన శాసనసభ కధికార మీయవలయును.
4 ఉప్పుపన్ను సీదాగా రద్దుచేయవలయును.
5 సైన్యమునకగు ఖర్చులను సగమునకు తగ్గించవలెను.
6 ఉద్యోగుల జీతములను సగమునకో యింకా తక్కువకో తగ్గించవలయును.
7 విదేశబట్టలపై తగు పన్ను విధించి దేశమున చేనేత యభివృద్ధి చేయవలయును.
8 భారతదేశతీరములనీ దేశపు ఓడలే తిరుగవలయును.
9 ఖూనీ నేరములకై శిక్షింపబడినవారు తప్ప మిగిలిన నేరస్తులను వదలివేయవలయును. ఐ. పి. సి. 124

ఏ. సెక్షను 1818 వం॥ 3 వ రిగ్యులేషను రద్దు చేయవలయును.

10 సి. ఐ. డి. శాఖను ఎత్తివేయుటగాని, దానిపై ప్రజాప్రతినిధుల కధికారము కలుగజేయుటగాని జరుగ వలయును.

11 న్యాయమగు ఆత్మరక్షణకై జనులు ఆయుధముల నుపయోగించుకొనుట కధికార మొసగవలెను.

1930 ఫిబ్రవరిలో భారతదేశ శ్రేయోభిలాషియగు రెజినాల్డు రేయినాల్డ్సు ద్వారా ఈరిపోర్టును వైస్రాయికి పంపబడెను తరువాత 1931 లో కరాచీ కాంగ్రెసులో యీతీర్మానము లన్నియు సభ్యులచే నేకగ్రీవముగ నామోదింపంబడెను. కాని, చట్టవ్యతిరేక కార్యము జేసిన శిక్షింపబడుదురని మాత్రము వైస్రాయి జవాబిచ్చి మిన్నకుండెను. అందువలన గాంధిగారు మరల సత్యాగ్రహము ప్రారంభింప తప్పినదికాదు. అదియే ఉప్పు సత్యాగ్రహము.

## 24. దండి ఉప్పుసత్యాగ్రహము.

గంజికైనను ఉప్పుగావలయునుగదా! దానిపై ప్రభుత్వ మెక్కువ పన్ను విధించిరి. ఒకరూపాయి ఉప్పులో రెండు అణాలే అసలు కిమ్మత్తు ఇట్టిదారుణపు పన్నును రద్దుచేయించవలయునని శాసనసభవా రెన్ని పర్యాయములు ప్రయత్నించినను విఫలమనోరథులైరి, అందువలన 12—3—1939 తేదీని 71 మంది వాలంటీరు దళముతో సబర్మతీ ఆశ్రమము నుండి బయలుదేరి అక్కడకు 200 మైళ్ళదూరమున పడమటి సముద్ర

మునగల 'దండి' అనే రేవుదగ్గర గాంధి సముద్రజలముతో నుప్పు తయారుచేసి ఉప్పు సత్యాగ్రహమును ప్రారంభించిరి. తయారు దేశమం దంతటను యీ సత్యాగ్రహము జయప్రద ముగ కొనసాగించిరి. అందు ముఖ్యముగ కాకినాడ సత్యాగ్రహమునకు కురుక్షేత్రమైనది. తరువాత వేదారణ్యమును, చిటగాంగు గ్రామరేవులు సత్యాగ్రహ సమరభూమికి ప్రాముఖ్యమైనవి.

సర్కారు ఈసత్యాగ్రహమును మొదట పరిహసించిరి. తరువాత ప్రజలలో ఉత్సాహము ఉద్రేకము హెచ్చుటవలన వాలంటీరులను నాయకులను అరెస్టుచేసి జైలులోనుంచిరి. అంతట ప్రజలలో ఉద్రేకము హెచ్చి సత్యాగ్రహమును విరివిగా చేయసాగిరి. అందువలన జైళ్ళు సత్యాగ్రహులతో నిండిపోయెను. జైళ్ళు పూర్తియగుటవలన సత్యాగ్రహుల నరెస్టుచేయుటమాని లాటీచార్జి ప్రారంభించిరి. తరువాత సూరత్ జిల్లాలో 'దర్శన' అను చోటనున్న సర్కారు ఉప్పుడిపో మీాదకు దాడివెడలుదుమని ముందుగ వైస్రాయికి గాంధి తెలియజేసెను. అందువలన 5 మే 1930 తేదీ రాత్రి పోలీసువారు గాంధిగారి నరెస్టుచేసి యరవాడజైలులో నుంచిరి.

తరువాత దేశములో విదేశవస్త్రబహిష్కారమును వస్తుబహిష్కారము జయప్రదముగ జరిగెను. కల్లుపాటలు పాడువారు వెనుకంజవేసిరి. అదియునుగాక ఆసంవత్సరము సర్కారు పన్నులు వసూలుచేయుట మిక్కిలి కష్టకార్యమయ్యెను.

చేయునది లేక సర్కారు దేశములో నెట్టి సంబంధమును

లేని రాజభక్తులతో 'రౌండు టేబిలుసభ' నొకదానిని నేర్పర చిరి. తరువాత అట్టిసభ కేవల నిరుపయోగమైనదని సర్కారు తెలిసికొని అద్దానిని రద్దుచేసి సత్యాగ్రహులతో రాజీసాగించిరి. నాయకులను మొదట విడుదల చేసినగాని రాజీమాటలు కుదర వని గాంధి జవహరలాలు నిశ్చయించిరి. అందువలన 26-1-1931 తేదీని సర్కారు కాంగ్రెసు కార్యవర్గపు సభ్యుల నందరను జైలునుండి విడుదల గావించెను.

## 25. గాంధి యిర్విను ఒడంబడిక.

తరువాత మోతీలాలు 5-2-1931 తేదీని చనిపోవుట వలన గాంధిగారును మిగిలిన నాయకులును విచారసాగరమున నీదులాడుచుండిరి. అంతట ఢిల్లీలో సర్కారువారి కోరికపైన రాజీమాటలు జరిగెను. మిక్కిలి కష్టముమీద 5-3-1931 తేదీని గాంధి యిర్వినులకు రాజీకుదురుట వలన వారిరువురు రాజీ పత్రముపై సంతకముచేసిరి. సముద్రప్రాంతపు జనులు స్వంత వాడుకకు ఉప్పు చేసికొనవచ్చు ననియు. దేశపరిపాలన ప్రజా ప్రతినిధుల యిష్టముగనే యుండవలయు ననియు ఆ రాజీయందు నిర్ణయింపబడినది. అందువలన సర్కారు సత్యాగ్రహులను విడుదల చేసిరి. ఇటీవల నమలులలో పెట్టబడిన ఆర్డినెన్సులను రద్దుచేసి అట్టి గౌరవప్రదమగు రాజీ కుదురుటవలన గాంధి సత్యాగ్రహమును రద్దుచేసెను. తరువాత రయితులు పన్నులు కట్టివేసిరి.

## 26. గాంధి లండను ప్రయాణము.

రాజీ యనంతరము 1930 లో కాంగ్రెసు మహాసభ

కరాచీ నగరమున శ్రీ వల్లభాయి పటేలుగారి అధ్యక్షతక్రింద జరిగెను. ప్రజలహక్కులను నిరూపించుచు నొక దీర్ఘప్రణాళికను జవహరలాలు గాంధిగారితో నాలోచించి తీర్మాన రూపముగ ఆ మహాసభలో పెట్టెను. సభవారా తీర్మానమును పూర్తిగ నామోదించిరి.

అప్పుడు యువకులు కొందరు గాంధిగారిని తొందర జేసిరి. ఒక పోలీసు ఆంగ్లోద్యోగిని హత్యచేసెనను నేరమునకై 'భగవత్సింగును' సర్కారు ఉరితీసిరి. ఆ శిక్షను రద్దుచేయించుటకై నాయకులు ప్రయత్నించిరి. గాని చివరకు లాభము లేకపోయెను. దేశభక్తాగ్రేసరు డగు భగవత్సింగును సర్కారు ఉరితీసినందుకు భారతీయులు చాల పరితపించిరి.

అంతట క్రొత్తరాజ్యాంగము స్థిరపరచుటకై కాంగ్రెసు తరపున 20 మంది ప్రతినిధులను లండనుకు పంపవలయు నని సర్కారు కాంగ్రెసును కోరిరి. కాంగ్రెసుతరపున లండనుసభలో గాంధిగారు ప్రతినిధిగా నుండవలయునని నాయకులు స్థిరపరచిరి.

తరువాత బ్రిటను దేశమునకును భారత దేశమునకును సమాన లాభదాయకమైన షరతులనే చేర్పింతుమని సర్కారు స్పష్టపరచినగాని తాను లండను వెళ్ళనని గాంధి తెలిపెను. బ్రిటిషువారి యుక్తిలోబడి భారతీయనాయకులా విధముగ తమలోతాము విరోధములను కలిగించుకొనిరి.

అంతట బ్రిటనులో పార్లమెంటు ఎన్నికలు జరిగెను. అందు కాన్సర్వేటీవుపార్టీవారికి అధికారము లభించెను. వారు

కేవల సామ్రాజ్యవాదులు. ఈసామ్రాజ్యవాదులకు నాయకు
డయిన మాగ్డొనాల్డు బ్రిటిషు దేశమునకు ప్రధానియయ్యెను.
ఇదివరలో మాగ్డొనాల్డు కార్మికపక్షనాయకుడుగా వర్తించెను.
ఈప్రస్తుత ఎన్నికలయందు కార్మిక పక్షమువా రోడుటవలన
మాగ్డొనాల్డు కార్మికులను వదలి సామ్రాజ్యవాదులలో చేరెను.

ఇట్టి మాగ్డొనాల్డు పన్నిన తంత్రములకు లోనయిన నా
యకులు గాంధిగారితో చేరక చివరకు ఉభయ భ్రష్టుత్వమును
చెందిరి. ఇంతలో మనదేశమున పరిస్థితులు మారిన వనియు
మరల సత్యాగ్రహము చేయవలయుననియు కాంగ్రెసు నాయ
కులనుండి గాంధిగారికి వర్తమానము వచ్చెను.

అందువలన గాంధి 5—12—1931 తేదీని బయలు
దేరి మనదేశమునకు వచ్చెను. త్రోవలో ఫ్రాన్సు స్విట్జర్లెండు
వెళ్ళి తన హిందూసిద్ధాంతములను అక్కడ ప్రచారముజేసెను.
ఇటలీలో ముసోలినీని సందర్శించి ఆయనతో సంభాషించి
28—12—1931 తేదీని బొంబాయి చేరుకొనెను.

## 27. రాజీ విచ్ఛేదము.

ఇంగ్లండులో 'కాన్సర్వేటివు' వారికి అనగా సామ్రాజ్య
వాదులకు అధికారము లభించిన దని దేశమునందలి
సర్కారు ఉద్యోగులు గాంధి ఇర్విను ఒడంబడికకు భిన్నముగ
ప్రవర్తింపసాగిరి లండనులో రాజీకుదరదనియు మరల సత్యా
గ్రహము ప్రారంభింపకుండనె కాంగ్రెసును రూపుమాపవలయు
ననియు ఉద్యోగస్తులు స్థిరపరచుకొని రాజకీయసభలకు ఆటం
కములు కలుగజేయ మొదలుపెట్టిరి. కాంగ్రెసు నాయకులను

కొందరిని అరెస్టుచేసియు, కొందరిని లాఠీలతో కొట్టియు, బెద రించిరి. కల్లుతాగుటను ప్రోత్సహించి పికెటింగుచేయవచ్చు నని యిదివరలో గాంధి యిర్విను ఒడంబడికయందు కలదు. అట్టి పికెటింగునుకూడ సర్కారు యిప్పుడు అనేక ఆటంకములు కలిగించిరి. ఈవిధముగ గాంధి యిర్విను ఒడంబడికకు భిన్నముగ సర్కారు ప్రవర్తింప సాగిరి. ఈలోపున దేశమున హాఠా త్తుగ గింజలకు ధరలు తగ్గెను. రయితులుపన్నులు కట్టలేక పోయిరి. అందువలన సర్కారు కఠినముగ రయితులనుండి పన్నులు వసూలుచేయ సమకట్టిరి. దానంజేసి చిటగాంగులో కొందరు రౌడీలును ఆంగ్లేయులును కూడ దౌర్జన్య చర్యల సాగించిరి. మరియు 1931 సెప్టెంబరు లగాయితు బ్రిటిషువారు మనదేశమునుండి బంగారపు యెగుమతి నారంభించిరి. ఈవిధ ముగ దేశమున ఆర్థిక దుస్థితి కలిగినది.

గాంధి భారతదేశమునకు రాకపూర్వమే సరిహద్దురాష్ట్ర జాతీయ వాదనాయకుడైన అబ్దుల్ గఫూరుఖానును సర్కారు అరెస్టుచేసెను. జవహర్లాలును కూడ అరెస్టుచేసిరి. దేశమున క్రొత్తనిర్బంధశాసనముల నమలు పెట్టదలచిరి. ఇట్టి విషమ పరిస్థితిలో గాంధిగారు భారతదేశమునకు వచ్చిరి. వైస్రాయితో సంప్రతించి యెట్లయిన మరల దేశమున శాంతినెలకొల్పుటకై గాంధి ప్రయత్నించెను. గాని లాభము లేకపోయెను. అందు వలన తిరిగి సత్యాగ్రహము చేయవలయునని నాయకుగా తీర్మానించిరి.

## 23. మరల సత్యాగ్రహము.

అందువలన దేశమునందంతటను గొప్ప సత్యాగ్రహము జరిగినది. ప్రభుత్వము వెంటనే 4–1–1932 తేదీన కఠినము లైన నిర్బంధశాసనముల నమలులో పెట్టెను. గాంధిగారిని విచారణ సలుపకయే యరవాడ జైలులో పెట్టిరి. కొందరు కల్లుపాకలను పికెటింగుచేసిరి. కొందరుప్పుచేసి అమ్మిరి. కొందరు విదేశవస్తు దుకాణములను పికెటింగు చేసిరి. కొందరు ఉద్యోగముల వదలి కాంగ్రెసులో ప్రవేశించిరి. కొందరు ఆంక్షలోనున్న గీతములను పాడిరి. ఈవిధముగ పూర్వముకన్న సత్యాగ్రహము తీవ్రమైనది. రెండుసంవత్సరములలో జైళ్ళునిండెను. ఇంకను పెక్కురు జైళ్ళకు సిద్ధులైరి. అంతట ప్రభుత్వము పరిపాలనా విధానము కొంతమార్చిరి. 1932 చివర ఆసత్యాగ్రహము కొంత తగ్గెను. 1931 లో విల్లింగ్డను ప్రభువు వైస్రాయియై సర్కారు ఉద్యోగులకు సర్వాధికారముల నొసంగి సత్యాగ్రహము అణచివేయవలయునని ఆజ్ఞాపించెను. అందువలన పోలీసువారు పెక్కు లాటీచార్జీలు జరుపుటవలన దేశమున బీభత్సము సంభవించెను. ప్రభుత్వప్రేరేపణవలన ముస్లిం పంచము, క్రైస్తవనాయకులు కాంగ్రెసుకు వ్యతిరేకముగ వర్తించిరి. అప్పుడు గాంధిగారు హరిజనదీక్షయందుండిరి. ఇట్టి క్లిష్ట పరిస్థితులు కలుగుటవలన 1933 లో గాంధిగారే సత్యాగ్రహము నాపుచేసి కఠినమైన ఉపవాసదీక్ష వహించిరి. గాంధి యీసారి ఉపవాసదీక్ష వహించుటకు విచిత్ర కారణము కలదు. బ్రిటిషు ప్రధాని హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గ మేర్ప

రచి హిందూ ప్రతినిధుల యెన్నికలలో హరిజనులు వోటు నిచ్చు అధికారమును కలుగజేసెను. అందువలన హరిజనులకును హిందువులకును సామరస్యత నశించి హరిజనులింకను శాశ్వత అస్పృశ్య సంఘముగనే యుందురు. లేదా క్రైస్తవులతోగాని ముస్లిములతోగాని కలియుదురు. ప్రత్యేక నియోజకవర్గపు వారు ముందు స్వలాభములకై సర్కారుకు మద్దతగుచుందురు. ఇట్టి ఆలోచనలతో ప్రధానమంత్రి హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరచెను. అందువలన మనజాతీయతకు శాశ్వతమయిన హాని సంభవించును. అందువలన హిందువులలో ఏకాభిప్రాయమును కలుగజేయు తలంపుతో గాంధి ఉపవాసముచేయ మొదలు పెట్టెను. ఈవిషయము ప్రభుత్వము 12-9-32 తేదీని ప్రజలకు తెలియజేసెను. నానాటికి గాంధిగారి స్థితి మారుచుండెను. అట్టి ప్రమాద స్థితిలో హరిజననాయకులగు ఎం. సి. రాజా అంబేద్కరుగార్లును మాలవ్యా మొదలగు హిందూనాయకులును 5 దినములు చర్చలు జరిపి చివరకు రాజీపడిరి. సర్కారు మరువాడే సాంఘికనిర్ణయమును సవరించిరి. ఇట్టిరాజీకి భారతదేశమునగల అన్నిపక్షములవారును ఆనందించిరి. హిందువులకును, హరిజనులకును సఖ్యతకూర్చవలయునని గాంధి ఉపవాసదీక్షను వహించెనుగదా? అట్టిదిఅస్పృశ్యతయున్నంతకాలము జరుగదు. అందులకై అస్పృశ్యతను నిర్మూలింపజేయవలయునని గాంధి తలచి హరిజనులు దేవాలయ ప్రవేశము చేయవచ్చునని బొంబాయి సభలలో తీర్మానించిరి. అట్టి

తీర్మానము అధికసంఖ్యాకులచే నామోదింపబడెను. గాంధి జయిలునుండియే పత్రికలకు హరిజనోద్ధారణకై వ్యాసము వ్రాసి పంపిరి. అప్పటినుండియు నేటివరకు హరిజనులకు హిందువులకు సఖ్యత కలుగుటకై మిక్కిలి పాటుబడుచుండెను. ఆయన కోరిక చాలవరకు ఫలించినదనియే చెప్పవచ్చును.

## 29. వ్యక్తి సత్యాగ్రహము.

ప్రభుత్వము సత్యాగ్రహమును నణచివేయుట కెంత ప్రయత్నించినను లాభము లేకపోయెను. 1932 కడవరకు సత్యాగ్రహము నిర్విఘ్నముగ కొనసాగెను. 1932 ఏప్రిలులో రాజధానియగు ఢిల్లీలో రాజవీధియగు చందినీ చౌకులో కాంగ్రెసు మహాసభ జరిగెను. వార్షికమహాసభ 1933 లో కలకత్తా నగరమున జయప్రదముగ జరిగెను. 14-1-1933 తేదీని సత్యాగ్రహ వార్షికోత్సవము జయప్రదముగ జరుగుచున్న దినమున క్రొత్తవైస్రాయి విల్లింగ్డను ప్రభువు తుదకందుల కంగీకరించెను.

తనకు ఇష్టము లేకున్నను ప్రజాభిప్రాయము ననుసరించి 29—8—31 ని గాంధిగారు శ్రీమాలవ్య సరోజనీ మొదలగు వారితో బయలుదేరి లండనుకు వెళ్ళిరి. ఇంగ్లండుచేరి లండనులో 'ఈస్టెండు' అను తూర్పుపేటలో గాంధి తనబస నేర్పాటుచేసికొనెను. ఆపేటలో కూలీలుమాత్రమే నివశించు చుందురు. ఆపేటలో 'మిస్ లెస్టర్' అను నామె గృహమున నతిథియై గాంధి అచటి కార్మికులతో పరిచయమును కలుగజేసికొనెను.

మిగిలిన భారతీయ ప్రతినిధులు సర్కారు ఖర్చులపై విమాన సంచారములు సలుపుచు విలాసముగ తిరుగుచుండిరి. అంతట లండనులో జరుగు సభలలో గాంధి కాంగ్రెసువారి భావములను ప్రచారము చేసెను. సర్కారు పూర్వమువలె హిందూమహమ్మదీయ విభేదముల నేర్పరచి వాటిని భారతీయులు ముందుగ పైసలు చేసికొనినగాని పూర్తిఅధికారము కాంగ్రెసుకు యిచ్చుట వీలులేదని ప్రధానమంత్రి తెలిపెను. ఇట్టి పరస్పర విరోధములు కలిగించుటలో బ్రిటిషు రాజనీతి పరులు నిపుణులు. అల్పసంఖ్యాకుల హక్కులను కాపాడుట బ్రిటిషు ప్రభుత్వపు విధి యని స్పష్టముగ ప్రధానమంత్రి తెలిపెను. అట్టి పేచీవచ్చునని గాంధి ముందే గ్రహించెను. అంతట తమతమ సంఘములకు ప్రత్యేకహక్కు లుండవలయునని ముస్లింనాయకులు అగాఖాను జిన్నాగార్లును హరిజన ప్రతినిధియైన అంబేద్కరుగారును, సిక్కునాయకులును, క్రైస్తవ నాయకులు పేచీ పెట్టిరి. ఆయా దేశములకు చెప్పి భారతదేశ క్షేమమును కాపాడి తమ మాతృభూమి మర్యాదను నిలువబెట్టవలసినదిగా కోరిరి స్వలాభముల నపేక్షించి వారందులకు సమ్మతింపలేదు. శాసనసభలలో తమ కెక్కువ స్థానములు కావలెనని మహమ్మదీయులు కోరిరి. జమీందార్లును సంస్థానాధీశ్వరులును కేంద్రప్రభుత్వమున తమ కెక్కువ యధికారము కోరిరి. ఈవిధముగ భారతదేశమునుండి లండనుకు పోయిన ప్రతినిధులలో పరస్పర విభేదములు కల్పించి స్వరాజ్య సమస్యనుండి సర్కారు తప్పించుకొనిరి. వారిలో వారిని సమ

స్వాయ మేర్పడినగాని స్వరాజ్యమిచ్చుటకు వీలులేదని బ్రిటిషు వారు తెలిపిరి.

30. అఖిలభారత గ్రామపరిశ్రమ సంఘము.

తరువాత గాంధిగారు 1934 లో అఖిలభారత గ్రామ పరిశ్రమ సంఘము నొకదానిని స్థాపించి చేతిపరిశ్రమలను వృద్ధి జేసెను. ఆసంవత్సరము కాంగ్రెసుమహాసభ బొంబాయిలో శ్రీరాజేంద్రప్రసాదుగారి అధ్యక్షతక్రింద జరిగినది. ఆమహాసభ వారు మహాత్ముడు కాంగ్రెసును విడిచిపుచ్చినందుకు విచారమును, అంతవరకు ఆయన కాంగ్రెసునకు జేసిన సేవకు సానుభూతిని వెల్లడించిరి. పిదప మహాత్ముడు తన మిత్రుడగు యమునాలాలు బజాజుగారికి జెదిన సేవాగ్రామము మను పల్లెటూరిలో నివసించుచు గ్రామముల కనుకూలదాయకమైన నిర్మానకార్యక్రమమును జయప్రదముగ నడిపించెను.

31. కాంగ్రెసునకు అధికారము లభించుట.

1932 లో కఠినముగ లాఠీప్రయోగము చేయుచునే మన దేశమున కనువగు క్రొత్తరాజ్యాంగమును గూర్చి చర్చలు జరిగించి తరువాత ప్రభుత్వమువారు 'శ్వేతపత్రము' తయారు చేసి దానిని విచారించుటకై ఒక సంఘము నేర్పరచిరి. ఈవిధముగ రెండుసంవత్సరములు కాలయాపన జేసిరి. దాని ననుసరించియే 1395 లో ఒక చట్టమును సర్కారు అమలులోపెట్టిరి. 1936 లో కాంగ్రెసు మహాసభ లక్నోనగరమున జవహర్లాలు అధ్యక్షతను జరిగెను. ఆసభవారు కాంగ్రెసువా రెన్నికలలో పోటీచేయవలయునని తీర్మానించిరి. 1937 లో అన్నిరాష్ట్రము

లయందు ఎన్నికలు జరిగెను. అప్పుడు కాంగ్రెసువారు మద్రాసు బొంబాయి, బీహారు మొదలగు రాష్ట్రములలో పోటీసలిపి అఖండ విజయమును చెందిరి. చట్టము ననుసరించి గవర్నర్లు కాంగ్రెసువారు చేయుపనులకు ప్రత్యేకాధికారముల క్రింద అడ్డు తగులమని మాట యిచ్చినగాని మంత్రిత్వము వహింపమని కాంగ్రెసువారు సర్కారుకు తెలిపిరి. అందుకు మొదట ప్రభుత్వమువా రంగీకరింపనందున కాంగ్రెసువారు మంత్రుల నేర్పాటుచేయుటకు నిరాకరించిరి చేయునదిలేక చివరకు ప్రభుత్వము వారు సాధారణముగ మంత్రుల కార్యములలో జోక్యము కలుగజేసుకోమని వాగ్దానముచేసిరి, అప్పుడు 1937 జూలై లో కాంగ్రెసు ఆరురాష్ట్రములలోను మంత్రుల నేర్పరచి అఖండ ఖ్యాతిని చెందెను.

## 32. హరిపుర కాంగ్రెసుసభ.

1938 లో కాంగ్రెసు మహాసభ బర్డోలీ తాలూకాలో హరిపుర గ్రామమున జరిగెను. హరిపురమునకు 2½ మైళ్ళు దూరములో స్వర్గీయ శ్రీవిఠలుబాయి పటేలుగారి స్మారకముగ 'విఠల్ నగర్' మను నొకగ్రామమును నిర్మించి కాంగ్రెసు సభవారికి భోజనాదులందు నేర్పాటుచేసిరి. ఈమహాసభకు సుమారు 2½ లక్షల జనులు వచ్చిరి. ఈసభకు 7½ లక్షలు ఖర్చైనవి. ఇంతటి మహాసభ ఇదివరకెన్నడును జరిగియుండ లేదు. దేశప్రఖ్యాతిజెందిన సుభాషు చంద్రబోసు యీసభకు అధ్యక్షత వహించెను ఖద్దరు వ్యాప్తియు స్వదేశవస్తు ప్రదర్శనమును యీకాంగ్రెసున విరివిగ జరిగినది మహాత్ముడే దీనికి ప్రారంభోత్సవము ను జేసి జయప్రదముగ నడపించెను.

### 33 గాంధి జీవితరహస్యములు.

గాంధి మహాత్ముడు నిగర్వచూడామణి. అందువలననే ఆయన సదా అంగవస్త్రమునే ధరించును. పట్టుదలయు సాహసమును ఆయనయందు మూర్తీభవించుచున్నవి. గాంధి సత్యమున హరిశ్చంద్రునకు సాటియగును. ఇంద్రియనిగ్రహము పరోపకారబుద్ధి, అహింసాది సద్గుణ సహస్రములలో ఆయన వర్తించుచుండును. చూచుటకు మాత్రము సన్నముగను. దుర్బలముగను కాన్పించునేగాని ఆయన ముఖము బ్రహ్మతేజస్సు తాండవమాడుచుండును. ఎట్టివానినైనను నాకర్షించు శక్తి ఆయన ముఖమున గలదు. అట్టి ధీరుడు సామాన్యుడు గాడని మనము గ్రహింపవలయును

ప్రతిదినమును ఆయన 4 గంటలకే మేల్కాంచి, కాలకృత్యముల తీర్చుకొని, ఈశ్వరధ్యానము చేసుకొని దేహపరిశ్రమకై ఊరిబయట విశాల ప్రదేశములందు తిరుగుచుండును. ఎన్ని ఆటంకములు సంభవించినను ఆయన తన అలవాటులను మానక సకాలములలో నిర్వర్తించుచుండును. దక్షిణాఫ్రికాలో నున్న నాటినుండియు, ఆయన బ్రహ్మచర్య మవలంబించెను. గాంధి తరుచు మేకపాలను త్రాగుచుండును. మేకలు అనేక రకములగు ఆకులను ఓషధులను తినుచుండును. అందువలన ఆపాలు శరీరసౌష్టవమును కాపాడుటయేగాక క్రిములను హరింపజేసి మంచి ఆరోగ్యమును కలుగజేయును. సాయంకాల భోజనము ఆయన చీకటి పడకమునుపే జేయును. సాయంకాలమున సంచారానంతరము స్నానముచేసి దైవప్రార్థన చేయును. ఆరోగ్యమునకై ఆయన తరుచు ఉపవాసములు చేయుచుండును.

అట్టిప్రకృతిచికిత్సతో కొందరికి పెద్దవ్యాధులుకూడ కుదిర్చెను.

మహాత్ముడు గొప్పత్యాగి. మహాత్ముని కుటుంబమును గమనింతము. గాంధికి 40 యేండ్లు వయసుకే కుటుంబముపై మమకారము వదలిపోయెను. అప్పటినుండియు గాంధియు ఆయన భార్య కస్తూరిబాయియు వారి ఆశ్రమములోనుండి ప్రజాసేవ జేయుచున్నారు. గాంధి, కస్తూరిబాయిలకు నలుగురు కుమాళ్ళు జన్మించిరి.

అందు జ్యేష్ఠుడు హరిలాల్ గాంధి దుర్వ్యసనములకు లోనై దుష్ప్రవర్తన కలవాడయ్యెను. ద్వితీయుడగు మణిలాల్ గాంధి దక్షిణాఫ్రికాలో భారతీయులకు నాయకత్వము వహించి పితృమార్గానుసారియై ప్రజాసేవ చేయుచుండెను. మూడవ వాడగు రామదాసుగాంధి వ్యాపారముచే జీవించుచుండెను. నాల్గవవాడగు దేవదాసుగాంధి తండ్రిననుసరించి ఖద్దరు వ్యాప్తి హిందీ ప్రచారము, పత్రికా సంపాదకత్వము చేయుచుండెను. ప్రస్తుతము ఢిల్లీలో 'హిందూస్థాన్ టైమ్సు' అను ఆంగ్ల దిన పత్రికకు సంపాదకుడుగ నుండెను. గాంధియు, ఆయన భార్య కస్తూరిభాయియు సంసారసాగరమున బడక తమ జీవితములను ప్రజాసేవకే వినియోగించుచు తమ ఉదార స్వభావములను ప్రపంచకమునకు వెల్లడించుచున్నారు.

### 34. రాజకీయ జీవితము.

గాంధి మహాత్ముడు గొప్ప రాజకీయవేత్త. కాని ఆయన తరుచు ఆధ్యాత్మిక జీవితమునకే ప్రాముఖ్యత యొసంగుచుండుట మనము చూచుచుంటిమి. పరాధీనులు విజ్ఞానశూన్యులగుదు రనియు, మతాభివృద్ధికి రాజకీయస్వాతంత్ర్య మవసరమనియు

మహాత్ముడు తలచి రాజకీయములలో ప్రవేశించెను.

మహాత్ముడు 1915 లో మన రాజకీయ రంగమునకు వచ్చెను. బోయరు, జూలూ, జర్మను యుద్ధములలో మహాత్ముడు బ్రిటిషువారికి తోడ్పడెను. ఆంగ్లేయ పరిపాలన న్యాయమైనదే యనియు, వారు మనలను హింసింపకూడ దనియు, డొమినియను స్వరాజ్యము మనకు లభింపవలయును ననియు, అను గాంధిగారి భావములు మితవాదులకు సంతసము గల్గించెను.

కాని బ్రిటిషుప్రభుత్వము మనకు డొమినియను స్వరాజ్య మీయక, ప్రజలలో జాతీయభావముల నణచుటకు కౌంటు చట్టము ప్రయోగించి దారుణచర్యలు జరుపుటవలన గాంధి తన లక్ష్యమును పూర్ణస్వరాజ్యము వైపునకు మరల్చి అసహాకారమును, సత్యాగ్రహమును ప్రయోగించి అఖండఖ్యాతిగాంచెను.

నేడు ఆయన భావములకు ఒక్క భారతదేశమే కాక భూవలయ మంతయు గౌరవించుచుండుట మనకు తెలిసిన విషయమే. భారతీయులందరును ఒకేజాతికి జెందినవారనియు వారిలో జాతీయభావముల వృద్ధిజేసి దేశమును విదేశీయుల నుండి కాపాడుట ధర్మమని ఆయన భావించెను.

గాంధిమహాత్ముడు గొప్ప సామ్యవాది. భూవలయమున ప్రతివ్యక్తియు స్వేచ్ఛగలిగి యుండవలయునని ఆయన కోరిక. హిందూదేశమున మితవాదులకును, అమితవాదులకును సఖ్యత కలుగజేసిన నిపుణుడు.

హిందూదేశమున కాంగ్రెసునకు గల పలుకుబడి నిరూపించుట కాయన ఆరు ముఖ్యరాష్ట్రములలో ప్రజలు కాంగ్రెసు

నాయకులను మంత్రులుగ నెన్నుకొనిరి. మరియు మెజారిటీలేని రాష్ట్రములలోకూడ గాంధిభావములకు గొప్ప గౌరవము కలదు. ఇంతటి రాజకీయవేత్త భూవలయమున వేరొక్కడు లేడని లోకము సదా చాటుచున్నది.

## ౪౫. గాంధిమహాత్వము.

గాంధిగారు మహాత్ముడనియు, లోకోత్తరమైన జీవితము కలవాడనియు చెప్పుచున్నారు. ఆయన మహాత్వ మెట్లేర్పడి నదో మనము గ్రహింపవలయును. ఆయన అద్వితీయమైన నిర్మల హృదయుడు, గాంధి దూరదృష్టి, అధ్యాత్మికశక్తి, అహింస, భూతదయ, దైవభక్తి, పరోపకారబుద్ధి కలవాడు. ఆయనకు న్యాయము, సత్యమునే ముఖ్యసాధనములు. అట్టి సద్గుణసంపన్నుడగుటవలన లోకము ఆయనను సదా పూజించు చున్నది ఆయన భౌతిక దుర్బలుడయ్యును, అద్వితీయమైన అధ్యాత్మిక సంపన్నుడై సదా లోకక్షేమమును కోరుచుండును.

గాంధి బుద్ధిచాతుర్యమువల్ల మైసూరు కొచ్చిన్ తిరువాన్కూరు మొదలగు రాజ్యములయందు ప్రజోపకార సంస్కరణముల నెన్నియో కావించెను. ఖద్దరు ప్రాముఖ్యమును భారతీయులకు బోధించి బీదలహృదయములను చూరగొనెను. సత్యాగ్రహమునకు పూర్వము వైస్రాయికి పంపిన అంత్య సందేశమునందలి 11 విషయములలో కొన్ని ఆర్థిక విషయములు గూడ చేర్చుటవలన 1930—32 వ సత్యాగ్రహములో వర్తకులు మహాత్మునకు మిక్కిలి సహాయపడిరి. హరిజనోద్ధరణకు ప్రాముఖ్య మొసగుటవలన నిమ్నజాతులు కాంగ్రెసులో ప్రవేశించి మహాత్ముని కనుసన్నల మెలగుచున్నవి.

అసమాన ప్రతిభా సంపన్నులగు వల్లభాయిపటేలు మున్నగు దేశోద్ధారకులు సదా గాంధిగారికి అనుచరులై ఆయన పద్ధతుల ననుసరించుకొనుచుందురు. ఇతర దేశములు యుద్ధము లకై మరఫిరంగులను తయారుచేయుచుండ మహాత్ముడు మన దేశమున అహింసాసిద్ధాంతమును బోధించుచు ప్రజలకు ఆత్మ శాంతిని కలుగజేసెను. మనదేశమున బీదల స్థితిగతుల పరిశీలించి వారిబాధల నివారణ కనువగు సిద్ధాంతములనే ఆయన అమ లులో పెట్టుచుందురు.

అట్టి నిరుపమాన సద్గుణోపేతయు, నిరంతరము హరిచర ణారవింద సేవాతత్పరుడగు మోహనదాస్ కరంచంద్ గాంధిగారికి 'మహాత్మ' నామము సార్థకమైనదిగ ప్రపంచము భావించుచున్నది.

36. సత్యాగ్రహము.

మహాత్ముని రాజకీయజీవితములో ముఖ్యముగగ మనింప వలసిననూతన విషయము 'సత్యాగ్రహము' సత్యాగ్రహము అనగా సత్యమందు ఆగ్రహము అనగా సత్యమును పొందుటకు పట్టుదల వహించుట మిత్రులకుగాని శత్రులకుగాని హింసజేయక వారి హృదయమును కరిగించి మనకార్యమును సాధించుట సత్యాగ్రహముయొక్క ముఖ్యాభిప్రాయము సత్యాగ్రహి. సత్య ము,ప్రేమ,అహింస మొదలగు సద్గుణములు కలిగియుండవలెను.

గాంధి మొదట 1906—1907 లలో దక్షిణాఫ్రికాలో గల ట్రాన్సువాలులో ప్రభుత్వముపైన సత్యాగ్రహ సమర మును గావించి జయమును పొందెను.

తరువాత 1915 లో మనదేశమున కతియవాడుసత్యా

గ్రహముచేసి దేశీయరాజ్యములనుండి ప్రభుత్వమునకు జెందిన జిల్లాలకు పోవువస్తువులపైన సర్కారు విధించుచున్న పన్ను రద్దు చేయించెను.

దక్షిణాఫ్రికాకు వలసబోయిన భారతీయులను నిర్బంధముగ కూలి చేయించుకొనుటకు 'ఇండెంచరు' అను కంట్రాక్టును సర్కారు రద్దుచేయవలయు ననియు లేనిచో సత్యాగ్రహము ప్రారంభింతుననియు గాంధి సర్కారుకు తెలియజేసెను. అందువలన సర్కారు 'ఇండెంచరు' పద్ధతిని రద్దుచేసిరి.

పిదప చంపారణ జిల్లాలో సత్యాగ్రహమును నలిపి తన కోరికలను గాంధి నెరవేర్చుకొనెను. తదనంతరము ఖేడాసత్యాగ్రహమును జరిపి రైతులను పన్ను బాధలనుండి రక్షించిన విషయము యిదివరలో చెప్పియుంటిని. 1919 లో రౌలటు చట్టమును తిరస్కరించుటకు సత్యాగ్రహము నలిపి కొంత జయమును పొందెను.

1930-31 లలో నాన్-కో-ఆపరేషను లేవదీసి విదేశవస్తు బహిష్కారము వస్త్రబహిష్కారము మొదలగునవి కొనసాగించెను. 1927 లో బార్డోలీలో సత్యాగ్రహము నలిపి గాంధి సర్కారు రైతులపై విధించిన హెచ్చుపన్నును రద్దుచేయించెను.

1930 లో ఉప్పు సత్యాగ్రహము గురించి యిదివరలో చెప్పియుంటినిగాని గాంధి యిర్విను సంధి భిన్నమగుటవలన 1932 లో గాంధి బ్రహ్మాండముగ జరిపి ప్రజలకు రాష్ట్రీయ పరిపాలనాధికారము కలుగజేసెను. మరల నేడు వాక్స్వాతంత్ర్యము నకై సత్యాగ్రహము సలువుచుండెను.

## 37. మద్య నిషేధము.

కల్లు, సారా, నల్లమందు మొదలగు మత్తుపదార్థములు మిక్కిలి హానికరములైనవి. ఒక్క మదరాసు రాష్ట్రములు సర్కారుకు సాలుసాకు కల్లు, సారా, నల్లమందు పాటవల్లన నాలుగుకోట్ల రూప్యములు లాభాంశము వచ్చును. అందువలన సర్కారు మద్యసేవ సణచుటకు మారుగ ప్రోత్సహించుచున్నారు. 1930 లో నాన్ - కో - ఆపరేషను కాలమున గాంధి వాలంటీర్లు ద్వారా కల్లుపాకలపికెటింగు చేయించెను. 1930-32లో జరిగిన సత్యాగ్రహములో కూడ గాంధి మద్యనిషేధమును ప్రచారముచేసెను. కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరించి 1 అక్టోబరు 1937 నుండియు మద్యనిషేధచట్టమును నమలులోనికి తెచ్చి సేలం జిల్లాలో అద్దానిని మొదట నమలుజరిపిరి. తరువాత చిత్తూరు, కడప జిల్లాలలోకూడ ఆచట్టము నమలు జరిపిరి. అందువలన బీదజనులలో గొప్ప సంస్కరణము కలిగెను. అంతట కాంగ్రెసు మంత్రిత్వముల వదలిరి. కనుక మద్యనిషేధమును తిరిగి ప్రజలే ప్రోత్సహించి భారతదేశమును నీతిదాయకమైనదిగ జేయగలందులకు కోరుచున్నాను.

## 38. అస్పృశ్యత.

బ్రాహ్మణ క్షత్రియో వైశ్యః త్రయోవర్ణా ద్విజాతయః
చతుర్థ యేకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః.

మనుస్మృతి—౧౦-౪

ధర్మశాస్త్రముల ననుసరించి హిందువులలో వర్ణములు నాలుగు విన్నినిబట్టిచూడ పంచమవర్ణములేదు. అయినను కొందరిని మనవారు పంచములుగ నిర్ణయించిరి. అట్టిది కేవలము శాస్త్రవిరుద్ధము. మాల, మాదిగ, చమారులను పంచము

లుగ నిర్ణయించి వారిని అస్పృశ్యులుగ నెంచు చున్నారు. బ్రాహ్మణస్త్రీలకు శూద్రులవలన జన్మించినవారే పంచములని కొందరు భావించు చున్నారు. మనదేశపు ఆదిమనివాసులని కొందరు తలచుచున్నారు. వీరు ప్రస్తుతము మనదేశములో నాల్గవవంతు కలరు. వీరు వ్యవసాయము, కూలి, మొదలగు పనులుజేసి మనలను బోషించుచున్నారు. వీరిని, అస్పృశ్యులుగ నిర్ణయించుటవలన మనదేశమునకు గొప్ప కళంకము సంభవించు చుండుట మనము గ్రహింపవలయును.

ఈవిషయము గాంధి దక్షిణాఫ్రికాలో 40 సంవత్సర ములక్రిందటనే గ్రహించెను. 1921 నుండియు కాంగ్రెసు అస్పృశ్యతా నివారణగురించి అనేక తీర్మానములు జేసిరి. తరువాత హరిజనులనదుమ వీరికి దేవాలయప్రవేశముకూడ గలిగించిరి. ప్రస్తుతము మనదేశమున అస్పృశ్యత చాలవరకు నశించినదనియే చెప్పవచ్చును. 1932–33 లలో గాంధి అస్పృశ్యతా విచారణకై తన ప్రాణములగూడ సమర్పించుటకు సిద్ధపడెను. హరిజనుల నుద్ధరించి హిందూమతమును వృద్ధిచేయు మహాత్ముడు నిరంతరము అమిత కృషిని సలుపుచుండెను.

## జ నా బా.

మనదేశపు జనాబా సుమారు 36 కోట్లు. అందు మహమ్మదీయులు సుమారు 8 కోట్లు గలరు. మిగిలినవారు హిందువులు. హిందూమహమ్మదీయులకు తరుచు మతకలహములు సంభవించుటవలన మనలో ఐకమత్యము నశించుచున్నది. స్వరాజ్య సంపాదనకు హిందూముస్లిం సఖ్యత ముఖ్యావసరము

మనలో మనము కలహించుటవలన విదేశ ప్రభుత్వము వారికి లాభదాయకమును, మనదేశమునకు హానికత్వమును కలుగును. 'విభజించి పాలించు' బ్రిటిషుప్రభుత్వము వారి రాజ నీతిమనకు తెలిసినదే. అందువలన మనము మోసపోక అన్ని మతముల మూలసూత్రము లొకటేయని గ్రహించి సాంఘిక మైత్రిని వృద్ధిచేసికొనుట దేశమునకు శ్రేయోదాయక మైనది.

1920 లో మహాత్ముడు ఖిలాఫత్తు సమస్యకు తోడ్పడి హిందూముస్లిముల కాయన సహకారము గల్గించెను. 1924 లో హిందూమహ్మదీయులకు తీవ్రసంఘర్షణ కలిగి చాలకూనీలు జరిగెను. అందువలన మహాత్ముడు 1924 సెప్టెంబరులో 21 దినములు దీర్ఘోపవాసము జేసెను, అప్పుడు దేశనాయకు లొక పంచాయితీ నేర్పరచి ఎవరి మతముల ననుసరించి వారు నడచు కొనుటకును సంఘమైత్రిని కాపాడుటకును వారు తీర్మా నించిరి. హిందువులకును మహ్మదీయులకును కలహములు కలవనియు అందువలన స్వరాజ్య మిచ్చుట వీలులేదనియు చెప్పుచు బ్రిటిషువారు మన స్వరాజ్యము నీయక కాలహరణము గావించు చున్నారు. కనుక స్వరాజ్య సంపాదనకు హిందూ ముస్లిం సఖ్యత ముఖ్యావసరము. అట్టి సఖ్యత కలుగనిచో హిందువులకును, ముస్లిములకును కూడ హానికత్వము తప్పదు. ఇరువురును చెడిపోదురు.

## 38. సామాన్య భాష.

మనదేశమున సామాన్యభాష లేకపోవుటవలన స్వరాజ్య మిచ్చుటకు వీలులేదని బ్రిటిషువారు చెప్పుచున్నారు.

మన దేశములో ముఖ్యభాషలు పది కలవు. ప్రస్తుతము

మన దేశమున ఇంగ్లీషు సామాన్యభాషగ వాడుచున్నారు. కాని ఇంగ్లీషు అన్యదేశభాష యగుటవలన చాల కష్టమైనది. హిందీభాషను మనదేశమున సామాన్యభాషగ చేయవలయు నని గాంధి 1915 నుండియు తీవ్ర ప్రచారము చేయుచుండెను.

39. గ్రామ పరిశ్రమలు.

మన దేశము చాల విశాలవంతమైనది. ఈ దేశమున సుమారు ఏడులక్షల గ్రామములున్నవి అందువలన గ్రామములన పునరుద్ధారణ ముఖ్యావసరమని మహాత్ముడు తలచి 1934 లో అఖిల భారత గ్రామపరిశ్రమ సంఘము 'ఆలిండియా విలేజి యిండస్ట్రీసు అసోసియేషన్' నొకదానిని స్థాపించిరి.

గ్రామస్థులచే తయారు కాబడు ఖద్దరు, చెరకుబెల్లము, దంపుడు బియ్యములు వాడుచుండిన విదేశవస్తువులను, పంచ దారయు, మిల్లుబియ్యము నశించును. అందువలన జనులు ఆరోగ్యముగ నుండుటయేగాక గ్రామస్థులకు ఆర్థికపరిస్థితి తొలగిపోవును. కోట్లకొలది బీదజనులకు వృత్తులు కలిగి నిరు ద్యోగసమస్య నశించును. మరియు కోట్లకొలది విదేశములకు పోవు ధనప్రవాహము నిలిచిపోయి భారతదేశమునకు పూర్వపు ఔన్నత్యము లభించును.

అందువలన ప్రతిభారతీయుడును గ్రామ పరిశ్రమలకు తోడ్పడి తమ విధ్యుక్త ధర్మమును నెరవేర్ప వలయునని కోరుచున్నాను.

---

వేణు ప్రెస్, రాజమండ్రి. ఇ. జి. 51 కా 1000 8-12-46

జై హింద్.　　వందేమాతరం.　　జై హింద్.







# నాయకుల జీవితములు

| | |
|---|---|
| అజాద్ హింద్ ఫౌజు | రూ 1—0— |
| సుభాసుచంద్రబోస్ | రూ 1—0—0 |
| పరారి నేతాజీ | రూ 1—0— |
| మహాత్మాగాంధి | రూ 1—0— |
| జవహర్లాల్ నెహ్రూ | రూ 1—0— |
| నెహ్రూ యిందిరకు లేఖలు | రూ 1—0—0 |
| జయప్రకాశ్ నారాయణ్ | రూ 0—8—0 |
| పృథ్వీసింగ్ | రూ 0—8—0 |
| అచ్యుత్ పట్వర్ధన్ | రూ 0—8—0 |
| అరుణాసఫాలీ | రూ 0—8—0 |

వలయువారు:—

## శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు.

రాజమండ్రి.

S. K P. Works, Rjy. E. G. 14. C. 1000-12-46.